ఉగాది సందేశం :

# యుగములు : మానవజీవితం

" విశ్వవిభుని యందు — విశ్వమంతా ఏరీతిగా వెలుగుచుండునో, అదే రీతిగనే ఆతని ప్రేమ విశ్వవ్యాప్తమై ప్రకాశించుచుండును. అట్టి విశ్వవిరాట్‌స్వరూపుని మైత్రి విడదీయ రాని స్నేహము వంటిదని చెప్పవలె. ఈ మాట సత్యమైనమాట అదే! సాయిమాట. కనిపించే జగత్తులో— " ఆత్మస్వరూపుని చైతన్యము ", మణులలోపల సూత్రము రీతిగ కనబడ కుండా వెలుగొందుచుండును. అదే విధముగనే, పరమాత్ముని - ప్రకృతి ఈ "ప్రజోత్పత్తి" రూపమున విశ్వవ్యాప్తమై, వ్యాపించి ఉన్నది ".

ప్రేమస్వరూపులారా!

కనిపించే ప్రపంచమును, ప్రపంచముగా చూచేవారే పామరులు. ఇది సామాన్యపు సాధన. ప్రపంచమును పరమాత్మ దృష్టితో గుర్తించటమనేది విశేషమైన వివేక సాధన. " సర్వం ఖల్విదం బ్రహ్మ" "విశ్వం విష్ణుస్వరూపం"— ఈ వేదోక్తులను పురస్కరించుకొని జగత్తంతయు పరమాత్మ స్వరూపమనే విశ్వసించాలి. భారతీయుల దృష్టిలో పరమాత్మ కానటువంటిది ఏ ఒక్కటీ లేదు. కానీ ఇట్టి పవిత్ర సత్యాన్ని గుర్తించలేని అజ్ఞానులు— భారతీయులను చెట్లను, పుట్టలను, గుట్టలను, గోవులను, పాములను, పక్షులను— పూజిస్తారని కొందరు అవహేళన చేస్తారు. కానీ సత్యతత్త్వమును గుర్తించుకొనే దివ్యత్వము మానవునియందు క్షీణించిపోవుచున్నది. ఏ దేశమునందు గాని, ఏ మతమునందు గాని ఈ రకమైన సాంఘిక న్యాయము ఎక్కడా కనిపించుట లేదు.

## ఊర్ధ్వ దృష్టిని పెంచుకో

మానవుని యందు పశుత్వం, మానవత్వం, దైవత్వము అనే మూడు తత్త్వములు ఇమిడి ఉంటున్నవి. మొదటిది అడుగు భాగముది పశుత్వం. ఈ పశుత్వం నిరంతరం భూమినే, క్రిందభాగమునే చూస్తుంది. తన దృష్టి అంతా

అడుగు భాగము వైపునే ఉంచుతుంది. అనగా తాను అధోగతి తత్త్వాన్నే అనుభవించటానికి ఆశిస్తుంది. మధ్యస్థాయి యందున్నదే మానవత్వము. మానవుడు నిరంతరం ఊర్ధ్వ దృష్టినే పెంచుకోవాలి. అప్పుడే తనపైన ఉన్న దివ్యత్వము తనకు అర్థమౌతుంది. కానీ దురదృష్టవశాత్తు మధ్యనున్న మానవుడు అడుగుదృష్టినే అభివృద్ధి పరచుకొంటున్నాడు గానీ, ఊర్ధ్వ దృష్టిని ఏమాత్రము పోషించుకొనుటకు ప్రయత్నించుటలేదు.

కనుక మానవుడు తన దృష్టిని ఉన్నతమైన, ఉత్తమమైన ఊర్ధ్వదృష్టిని అభివృద్ధి పరచుకోవాలి. మానవ జీవితము క్షణికమైనది కాదు. నూరు సంవత్సరముల పంట. ఐతే మానసిక ప్రవృత్తి క్షణికమైనది కాదు. ఈ మానసిక ప్రవృత్తి అనేక జన్మలనుండి మానవుని వెంటాడుతున్నటువంటి జంట వంటిది. ఇట్టి అతీతమైన కాలమునకు సంబంధించిన కాయము మనస్తత్వమైనప్పటికిని, మానవుడు తరించవలెనంటే ఒక్క క్షణము చాలు. సత్యతత్త్వమును గుర్తించుకొనుటకు ఒక్క క్షణమే చాలు. "యద్దృశ్యం తన్నశ్యం" కనిపించునదంతయూ కేవలం నశించునదే. అసత్యమైన జగత్తును సత్యముగా భావించి, విశ్వసించి సత్య సంబంధమైన ఆత్మతత్త్వమును విస్మరించటం చేతనే మానవుడు కాలమునకు లొంగిపోవుచున్నాడు.

## అపకారికి ఉపకారం చేయాలి

మానవుడు మానవుడు కాదు, " దైవం మానుష రూపేణా " దైవమే మనుష్యాకారము ధరించి దివ్యత్వమైన ఆత్మతత్త్వమును వెదికే నిమిత్తమై ఈ కాయమును ప్రసాదించినటువంటిది. ఏ ఆత్మ నిమిత్తమై ఈ దేహము ప్రసాదించెనో, అట్టి దేహము ఈనాడు "అన్నం" నిమిత్తమై ఆరాటపడుతూ ఆత్మను విస్మరిస్తూ వస్తున్నది. మానవుడు తరించుటకు బదులు గమ్యమునకు అతిదూరమైపోతున్నాడు. సకల వేద శాస్త్రములు గౌరవించవలసిన మార్గమును ప్రబోధిస్తూ వచ్చినవి. గౌరవించిన వారినే గౌరవించటం - అగౌరవించిన వారిని గౌరవించటం ఇది శాస్త్ర సమ్మతం. కానీ అగౌరవించిన వారినే గౌరవించటం, గౌరవించిన వారిని - అగౌరవించటం ఈ కలియొక్క ప్రభావము. ఉపకారికి ఉపకారము చేయుట విపరీతము కాదు, నెపమెన్నక అపకారికి ఉపకారము చేయటమే నేర్పరితనము. అపకారము చేసినవారికి ఉపకారము చేయటము ఈ అపకారమును ప్రోత్సహించినట్లు అవుతుంది కదా! అని భావించవచ్చును. కాదు - కాదు. అపకారికి ఉపకారము చెయ్యాలి. అట్లుకాక అపకారము చేసిన వారికి తిరిగి మనము అపకారము చేసినప్పుడు నీవు ఉపకారివి ఏరీతిగా కాగలవు ? అతను అపకారి అయినప్పుడు నీవు కూడా అపకారియే కాగలవు. కనుక నీ ఉన్నత స్థాయిని నీవు కోల్పోవుతున్నావు. అతను అపకారి అయినపటికినీ, నీవు ఉపకారము చెయ్యి, అప్పుడే నీవు ఉపకారి కాగలవు. నీ ఉన్నత వ్యక్తిత్వము నీవు పోషించుకొన్నవాడవు కాగలవు. కనుక వ్యక్తిత్వమును అభివృద్ధి పరచుకొనే నిమిత్తమై అపకారికి ఉపకారం చేయటం, అగౌరవించిన వారిని గౌరవించటం మానవుని ప్రధానమైన లక్షణం.

## సత్యాన్ని చక్కగా గుర్తించు

ఈనాటి మానవుడు ఇట్టి సత్యాన్ని చక్కగా గుర్తించటానికి ప్రయత్నించటంలేదు. సత్యాన్ని అసత్యంగా, అసత్యాన్ని సత్యంగా విశ్వసిస్తున్నాడు. ఉదాహరణ: ఏవిధమైన పనులు చేయకుండను భుజించి హాయిగా కాలాన్ని గడపాలని ఆశిస్తాడు. ఇందులో ఎంత అసత్యమున్నదో మనము గుర్తించటానికి ప్రయత్నించాలి. ఎట్టి కర్మలు ఆచరించక సుఖంగా నేను భుజించి, ఆనందమును అనుభవించాలని ఆశించటంలో ఎంత అసత్యముంది? భుజించటం కర్మ కాదా! గాలి తీసుకోవటం కర్మ కాదా! నడచటం కర్మ కాదా! మాట్లాడటం కర్మకాదా! కర్మ చేస్తూ నేను ఎట్టి కర్మలు చేయటం లేదని భ్రమిస్తున్నాడు. ఇది ఎంత విచిత్రమైన చిత్రం. కర్మ ఆచరిస్తూ, నేను ఆచరించటము లేదని భావిస్తున్నాడు. కర్మ ఆచరించక క్షణమైనా ఈ కాయము ఉండుటకు వీలుకాదు. కాయము కర్మచేత కట్టబడినది కనుక కర్మచేసే తీరాలి.

## చూచేదంతా భగవత్స్వరూపమే

"పశ్యన్న పిచ న పశ్యతి మూఢః" అన్నారు. అనగా భగవంతుని చూస్తూ, అనుభవిస్తూ, ఆనందిస్తూ— భగవంతుని చూడాలని-చూడాలని భ్రమిస్తున్నాడు. వీడు మూఢుడు కాక మరేమిటి? చూచేదంతా, అనుభవించేదంతా, ఆనందించేదంతా భగవత్స్వరూపము కాదా? భగవత్స్వరూపమంటే ప్రత్యేకమైనది ఎక్కడ ఉన్నది? ఆనందమే భగవత్స్వరూపం. దృశ్యమే భగవత్స్వరూపము. జగత్తే భగవత్స్వరూపం. కనుకనే "పశ్యన్న పిచ న పశ్యతి మూఢో". ఇదే విధంగా కర్మనాచరిస్తూ నేను కర్మను ఆచరించటము లేదని అనుకుంటున్నాడు. భగవంతుని చూస్తూ నేను భగవంతుని చూడాలని భ్రమిస్తున్నాడు. దీనికి మూడు విధములైన కారణములుంటున్నాయి. మల, విక్షేప, ఆవరణములని మూడు స్థితులు.

## మానవజీవితం సందేహాల పుట్ట

మలమనగా అద్దము పైన కప్పబడిన దుమ్మును మనము తుడిచినప్పుడే పోతుంది గాని, తుడవకపోతే పోదు. మన పరిశుద్ధమైన హృదయమునందు లోకసంబంధమైన, త్రిగుణాత్మకమయిన జగత్తత్త్వములు ఆవరించి ఉంటున్నాయి. ఇట్టిదానిని ప్రయత్నరూపంతో తుడిచినప్పుడే పోతుంది. కానీ మనము తుడుచుటకు బదులు ఆ మలమును మరింత అధికముగా చేర్చుకుంటున్నాము. కనుక నిత్య సత్యమై ప్రకాశించే ఆత్మ తత్త్వము మనకు అగోచరంగా వుంటున్నది.

ఇంక విక్షేపమనగా ఏమిటి? నిరంతరం చలించేటటువంటిది. ఈ చలించటం అంటే ఏమిటి? గుణముల యొక్క స్వభావము, రాగద్వేషముల యొక్క ప్రభావము, మనస్సు పైన తిరిగి తద్వారా ప్రతి దానియందు కూడ సందేహము సందేహము. మానవుని జీవితము అంతయూ కేవలము అనుమానములతోనే నిండి ఉంటున్నది. ఏది చేయాలని తలచుకొన్నప్పటికీ, 'ఇది అవుతుందో కాదో? చేయగలనో లేదో?' అనే అనుమానం అతనిని ఆవరించి ఉంటున్నది. కారణం ఏమిటి? సంపూర్ణ విశ్వాసము లేక పోవటమే దీనికి కారణము. సంపూర్ణమయిన విశ్వాసమే వుండి వుంటే, యిట్టి సందేహములకు అవకాశమే వుండదు.

కనుక మానవుడు సందేహ నిమిత్తమై కొన్ని విధములైన అభివృద్ధులను తనకుతానే ప్రోత్స హించుకుంటున్నాడు. మానవుడు తనను తానే నమ్మలేని పరిస్థితికి దిగజారిపోతున్నాడు. తన Pocket లో ఉన్న ధనమును తాను విశ్వసించ లేక- నా జేబులో ఉంటే పోతుందేమో అని, 'నీ జేబులో పెట్టుకో' అని ఇంకొకరి జేబులో పెడుతున్నాడు. పోనీ ఇతని జేబులో పెట్టి, అది భద్రముగా ఉంటుందని ధైర్యముగా ఉంటాడా ? లేదు, 'అతను తిరిగి యిస్తాడ ? యివ్వడో ?' అని తిరిగి సందేహము. కనుక మానవ జీవితమంతయు సందేహాల పుట్టగా తయారౌతున్నది. ఈ సందేహమనే పుట్టలోపల రాగద్వేషములనే సర్పాలు ప్రవేశిస్తున్నాయి. కనుక మన జీవితము ఒక పుట్టగా తయారైపో యింది. ఈ పుట్టనుండి ఎప్పుడు రాగద్వేష ములు వెలువడుతాయో చెప్పలేని స్థితిలో ఉంది. ఈ రాగద్వేషములే మానవుని కట్టి వేస్తున్నాయి. ఈ రాగద్వేషములకు కారణం సందేహమే. కనుక మానవుడు ఈనాడు గాఢ మైన విశ్వాసమును అభివృద్ధి పరచుకోవాలి. దైవముపైన విశ్వాసం లేకపోయినప్పటికి పరవా లేదు. తనపై తనకు విశ్వాసము అభివృద్ధిచేసు కోవాలి. తన విశ్వాసమే దైవ విశ్వాసము.

## హద్దులేని వాంఛలు కోరవద్దు

ఇంక మూడవది ఆవరణము. ఏమిటి మనలను ఆవరించినది ? కోరికలే మనలను ఆవరించినవి. మానవుడు ఈ కోరికలచేత కట్ట బడి ఉంటున్నాడు. తన వెనుక, క్రింద, పైన కోరికలు ఆవరించి ఉంటున్నాయి. ఏమిచేసినా ఏమి చూచినా, ఏమి చెప్పినా, ఏమి తలచినా, ఏ విధమైన స్థితిలో ఉండినప్పటికీ, ఈ వాంఛ అనేది ఏనాటికి కదలటం లేదు. ఈ కోరికలనే దానిలో మానవుడు కట్టబడి ఉంటున్నాడు. ధనవాంఛ, అధికారవాంఛ, ఆరోగ్యవాంఛ, కీర్తి వాంఛ యింకా యింకా ఎన్నెన్నో ఆ వాంఛ లంతా తిరుగుతూ ఉంటాయి. వాంఛలు దోషము కాదు. వాంఛలు ఉండవలసినదే. వాంఛలకు కొంత హద్దు వుంటుంది. ఈ హద్దు లేని వాంఛలచేతనే మానవుడు కట్టబడి పోతున్నాడు. ఈవిధమైన వాంఛలు క్రమ క్రమేణా తగ్గించుకోవటానికి ప్రయత్నించాలి.

## మానవునిబంధనాలు - ఈషణత్రియాలు

సర్వకర్మలు నీవు ఆచరించు. ప్రాపం చిక సంబంధమైన సుఖములు సర్వమూ నీవు అనుభవించు. కానీ సర్వకర్మల ఫలితము భగవంతుని తత్త్వమే అని గుర్తించు. ఏకర్మలు చేసినప్పటికి భగవత్ప్రీత్యర్థమని భావించు. ఈ త్యాగం వలన మానవత్వము కొంతవరకు వికసిస్తుంది. ఈనాటి మానవునకు మాన వత్వము బోధించటానికి మనము ప్రయత్నిం చాలిగాని, కేవలం వేదాంతముగాని యింకే విధమైన శాస్త్రములుగాని బోధించి ప్రయో జనము లేదు. 5వ సంవత్సరము పిల్లవానికి మొదటి తరగతి పుస్తకముతో బోధించినప్పుడే వానికి అర్థమవుతుంది గాని 10వ తరగతి పుస్తకంతో బోధిస్తే వానికి ఏమి అర్థమవుతుంది? ఈనాటి మానవుడు 1వ తరగతి విద్యార్థిగా ఉంటున్నాడు. ఇతనికి కేవలము ధనేషణ, దారేషణ, పుత్రేషణ ఈ ఈషణత్రయంచేతనే తాను కట్టబడి పోతున్నాడు. ఈ ఈషణత్రయ ములే మానవుని బంధనములుగా నిలిచిపోతు

న్నాయి. దీనికంటే అధికమైనది, ఉత్తమమైనది వానికి ఏమీ కనిపించుట లేదు. కట్టకడపటికి తాను మానవుడా? కాదా? అనే విషయంలో కూడా తాను విశ్వసించటం లేదు.

## "నేను" — ఆత్మతత్త్వం

తనకంటే దైవము ప్రత్యేకముగా లేదు. మానవుడు వృద్ధుడుగాని, యువకుడుగాని లేక చిన్నపిల్లవాడుగాని, స్త్రీగాని, రాజుగాని, రైతుగాని, భిక్షకుడుగాని— తనను తాను విచారించుకొని చెప్పుకొను సమయంలో ప్రతిఒక్కరు 'నేను-నేను' అనే పదమును ఉచ్చరిస్తారు. నేను భిక్షకుడను, నేను రాజును, నేను స్త్రీని, నేను పురుషుడను, నేను వృద్ధుడను, నేను చిన్న బాలుడను— ఈ అన్నింటియందును 'నేను' అనేటటువంటి సమత్వమైన తత్త్వం ఉచ్చరించబడుతూ ఉన్నది. ఈ "నేను" అనే తత్త్వమే ఆత్మతత్త్వ ఆ నేను' అనే తత్త్వమును సరిగా గుర్తించుకొనలేక— తెల్లవారిలేచినది మొదలు, రాత్రి పరుండునంత వరకూ ఈ 'నేను' అనే పదమును ఉపయోగ పెడుతున్నాడు మానవుడు. ఆ 'నేను' అనే పదమును వ్యర్థంగా ఉపయోగ పెడుతున్నాడు. కనుక జీవితమే వ్యర్థమైపోతున్నది. ఇది నా దేహము అంటున్నాడు. నా దేహమను కొన్నప్పుడు, దేహమునకు తనకు ఒక ప్రత్యేకమైన తేడా ఉంటున్నది కదా! నీవు దేహముకంటే ప్రత్యేకముగా ఉంటున్నావు కదా! నీవెవరు? ఈ విధమైన సత్యమైన విచారణలో ఏమానవుడు ప్రవేశించటము లేదు.

## మధురమైన దైవత్వానికి మధురత్వం అందించు!

ప్రాచీన కాలము నుండి భారతీయులు పవిత్రమైన పర్వదినముల తత్త్వమును కేవలం పారమార్థికంగా అనుభవిస్తూవచ్చారు. ఒక చిన్న ఉదాహరణ: ఈ పర్వదినముల యందు భారతీయులు భగవంతునకు నైవేద్యములు చేస్తూ ఉంటారు. కానీ ఈ నైవేద్యములు తీపి పదార్థములు మాత్రమే నైవేద్యం పెడుతూ ఉంటారు. ఏమీలేకపోతే చక్కెరో పటికబెల్లమో, ఒక అరటిపండో- భగవంతునికి నైవేద్యముగా పెడుతూ ఉంటారు. ఈ మధురమైన పదార్థములు భగవంతునికి అర్పితము చేయుటలో అంతరార్థము ఏమిటి? "భగవంతుడు మధురహృదయుడేతప్ప, మరొక హృదయం కలిగినటువంటివాడు కాదు" అని అర్థం. కనుక భక్తిరసామృతముతో కూడినదిగా ఉంటుండాలి. "వచనం మధురం, నయనం మధురం, హృదయం మధురం, మధురాధిపతే! మధురం మధురం!" మధురత్వమనేది దివ్యత్వమునకు ఒక చిహ్నము. కానీ ఈ మధురమైన దైవత్వానికి మధురత్వాన్ని అందించటానికి మానవుడు ఏమాత్రము సంసిద్ధంగా ఉండటం లేదు. పెట్టిన పటికబెల్లం తిరిగి తానే భుజించటానికి ప్రయత్నిస్తాడు మానవుడు. ఇది స్వార్థం. స్వార్థమునందే ఈ పరార్థమును కూడ అనుభవిస్తూ వస్తున్నాడు. కనుక మానవుడు స్వార్థము లేకుండా పరార్థాన్ని చేబట్టడం లేదు.

## కొబ్బరికాయ కొట్టుటలో భారతీయుల పరమార్థం

భారతీయుల ప్రధాన చిహ్నం కొబ్బరికాయ కొట్టడం. ఐతే, ఈ కొబ్బరికాయ తత్త్వాన్ని మనము చక్కగా విచారించాలి. ఇది మూడు రకములైన స్థాయిలలో ఉంటున్నది. పైన కఠినమైన, దట్టమైన పీచు, దానిలోపల మరింత కఠినమైన చిప్ప, దానిలోపలనే తెల్లని పరిశుద్ధమైన కొబ్బరి. ఈ మూడు ఒకదానినొకటి ఆశ్రయించి ఉంటున్నాయి. పైన పీచును తీయాలనుకొంటే, సామాన్యంగా అది తీయటానికి వీలుకాదు. సూటియైన కత్తితో పైపీచును ప్రయత్నపూర్వకంగా తీయాలి. అది తీసిన తరువాత ఒక గట్టిచిప్ప ఉంటుంది. ఆ చిప్పను మనము చేతులతో పగులకొట్టటానికి వీలుకాదు. ఇందు నిమిత్తమై ఒక కఠినమైన రాయినిగాని, ఖడ్గమునుగాని ఉపయోగించాలి. అది కొట్టిన తరువాతనే పరిశుద్ధమైన తెల్లని కొబ్బరి మనకు కనిపిస్తుంది. ఐతే ఈ కొబ్బరికాయ మనము దేనికోసం కొంటున్నాం? పై పీచుకోసం కొంటున్నామా? లేక లోపలి చిప్పకోసం కొంటున్నామా? కాదు - కాదు. అన్నింటి కంటే ఆధారమైన కొబ్బరి కోసం కొంటున్నాం. కనుక ఈ రెండింటి యొక్క ఆధారము దీని ఆధేయ తత్త్వములో ఇమిడి ఉంటున్నది.

మన శరీరం ఒక కొబ్బరికాయ వంటిది. త్రిగుణాత్మకమైన ప్రకృతి ఈ పైదేహం. అదే స్థూలదేహం. తదుపరి అవిద్య అజ్ఞానమనే సూక్ష్మదేహము మరొకటి ఉంటున్నది. దీనికి దేహమనే పీచు తీయాలంటే- దీనికి వైరాగ్యం అనేది కావాలి. దేహ విషయములో మనము వైరాగ్యము పూనాలి. ఇంక సూక్ష్మమైనది మనస్తత్వం. దీనికి సత్కర్మలు అచరించాలి. సదభ్యాసములలో మనము ప్రవేశించాలి. సచ్చింతన మనం చెయ్యాలి. మొదటిది అన్నమయ ప్రాణము, అదే స్థూల దేహము. దీనిని సూక్ష్మమైనదిగా పోల్చుకోవాలంటే- 5కోశములు ఉంటున్నాయి. ఈ పంచకోశములందు మొట్టమొదటి కోశమే అన్నమయకోశం, అది స్థూలమైనది. ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయములు. ఈ మూడింటి చేరికయే ఈ విజ్ఞానమయము. ఇంక, కారణదేహము- అదే ఆనందమయకోశము.

స్థూలదేహము పీచువంటిది. సూక్ష్మదేహం కేవలం చిప్పవంటిది, కారణదేహమే కొబ్బరివంటిది. ఆ కొబ్బరియే ఆత్మస్వరూపం. అదే నిర్మలం, నిశ్చలం. ఆత్మ అనే కొబ్బరి నిమిత్తమై ఈ ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయములనే చిప్పలను మనము కొంత వరకు కాపాడుకోవలసి వచ్చింది. దీనిపైనున్న స్థూలదేహమనే పీచును భద్రం చేసుకోవలసి వచ్చినది. కానీ, దురదృష్టవశాత్తు చిప్పపైన, పీచుపైన మన దృష్టిపోతున్నది గాని, లోపలి కొబ్బరిపైన మన దృష్టిపోవటం లేదు.

మన ప్రాచీన సాంప్రదాయంలో కొబ్బరికాయ కొట్టటమనగా ఏమిటి? దేహముపైన వైరాగ్యము, మనస్సుపైన ఒక విధమైన సాత్విక ప్రవర్తన రెండింటి ద్వారానే ఆత్మ అనే పరిశుద్ధమును మనము పొందవచ్చును అనే గుర్తుచేతనే కొబ్బరికాయను మనము కొడుతున్నాము. ఆత్మస్థాయిని మనం చేరాలనుకొంటే, మొట్టమొదట మనము విషయ వాసనలనే

చిప్పను దూరం చెయ్యాలి. ఆ చిప్పను మనం వేరుచేయటానికి పూర్వము త్రిగుణాత్మకమైన ప్రకృతి భావాన్ని మనము వేరు చెయ్యాలి. వైరాగ్యమనే దానికి పూనుకోవాలి. వైరాగ్యము అనగా అన్ని వదలిపెట్టి అరణ్యమునకు పారి పోవటం కాదు. అన్నింటియందు దైవభావాన్ని భావించుకోవటమే వైరాగ్యము.

## మనము - వాడు సమానమైపోతాము

మానవునికి సద్భావములు అత్యావసరం. తనలో ఉండిన దోషములను నిర్మూలన గావించుకోవాలి. దివ్యత్వమైన ఆత్మభావాన్ని మనం అభివృద్ధిపరచుకోవాలి. ఎవరిని మనం ద్వేషించకూడదు. ద్వేషించిన వానిని కూడా నీవు ప్రేమించు. వాడు నన్ను ద్వేషించాడు, "వాడు చెడ్డవాడు - వాడు చెడ్డవాడు" అనుకొని, నీవు కూడా వానిని ద్వేషిస్తే- వానితోబాటు నీవూ చెడ్డవాడవు అవుతావుగానీ, నీవు మంచివాడవు ఎట్లా అవుతావు? ఏ చెడ్డభావంతో ఒక వ్యక్తి ప్రవర్తిస్తాడో, మనంకూడా ఆ చెడ్డభావంతో ప్రవర్తించినచో- మనము, వాడు సమానమైపోతాము. అటువంటివానితో నీవు దూరంగా ఉండు. నీవు ద్వేషించనక్కరలేదు. భారతీయ సంస్కృతి యందు ప్రధానమైన దివ్యతత్త్వం ఏమంటే— "అనేకత్వంలోని ఏకత్వమును గుర్తించటమే ఆత్మతత్త్వమని" అన్నారు. ఇలాంటి అనేకత్వములోని ఏకత్వమును మనము మానవత్వముగా భావించినప్పుడే, అదే దివ్యత్వముగా మనకు సాక్షాత్కరిస్తుంది. భారతీయుల పర్వదినములు ప్రాచీన కాలము నుండి మనము అనేకవిధములుగా అనుభవిస్తూ, ఆచరిస్తూ వస్తున్నప్పటికిని, మనలోపలి భావాలు మాత్రం ఎక్కడవి అక్కడే ఉంటున్నాయిగాని, ఏమాత్రము పరిశుద్ధము కావటం లేదు.

## భగవద్భావం చేత సర్వం సాధించవచ్చు

ఈ సంవత్సరం పేరు ప్రజోత్పత్తి. ప్రజోత్పత్తి అనగా ప్రజలను ఉత్పత్తి చేయటమే. దానికి ఏ విధమైన అడ్డులేదు. వృద్ధి అవుతూనే వున్నది. ప్రజోత్పత్తి రానక్కర లేదు. దీనినే ప్రజాపతి అని కూడా అంటున్నారు. ప్రజాపతి అనగా బ్రహ్మ స్వరూపమని అర్థము. ప్రజాపతి అనేది ఈ సంవత్సరము యొక్క పేరు. బ్రహ్మ స్వరూపమైనది. పేరు మంచిదేగాని, ఆ పేరునకు తగిన ఫలితములు లేవు. ఈ సంవత్సరముయొక్క పేరును చూచి ఆనందిస్తే ఏమి ప్రయోజనం? ఒకని పేరు "ధర్మరాజు" అంతా అధర్మమే. మరొకడు "సౌందర్యరాజన్" అని పేరు పెట్టుకొన్నాడు. అతడు మహావికార స్వరూపుడు. అదే విధముగనే- పేరులో, రూపములో, ప్రవర్తనలో ఎంత వ్యత్యాసము కనబడుతోంది! ప్రజాపతి పేరు చాలామంచిగా ఉంటున్నది.

కానీ ఈ సంవత్సరము లోపల మహాఘోరమైన విషయాలు జరుగుతాయి. చోరుల బాధ అధికమై పోతుంది. ప్రాకృతమైన వికృతులు అనేకంగా మారిపోతూ వస్తాయి. మంచి చెడ్డగా మారిపోతుంది. రాజకీయ కల్లోలములకు హద్దు అనేదే ఉండదు. విపరీతమైన మార్పులు చెందుతాయి. అగ్నిప్రమాదములు, భూకంపములు— ఈ సంవత్సరములో చాలా అధికముగా ఉంటాయి. కానీ ఈ మార్పుల కోసమై మనం ఏ మాత్రము భయపడనక్కర లేదు. ఇవి ప్రాకృతమైన ధర్మములే. విరుద్ధ

మైనది ఏమీ కాదు. దానిని ఉపయోగించుకునే విధానములో మనము సరిగ్గా ఉపయోగించు కోవాలి. ఈ లోకం ద్వంద్వ వికారములతో కూడినది. శీతోష్ణములు రెండూ ఉంటున్నవి. ఏ ఏ సమయములో ఏ ఏ గుణములు రావాలో అది విజృంభిస్తుంది. అంతమాత్రంచేత మనం విరుద్ధమని భావించ రాదు. మన రాయల సీమలో మార్చి నెలలో చాలా వేడిగా ఉం టుంది. ఊటీ, కొడైకెనాల్‌లో చాలా చల్లగా ఉంటుంది. ఈ శీతోష్ణములు రెండూ సమాన ములే. కానీ ప్రదేశములు వేరు వేరు. అదే రీతి గనే మన భావాలు మంచి, చెడ్డలుగా మారటా నికి అవకాశమున్నది. ఒక మనిషి ఉలెన్‌షర్టు కుట్టించుకొన్నాడు. అదే మనిషి Thin Cotton Shirt కుట్టించుకున్నాడు. రెండూ నా షర్టులే అని చెప్పి ఈ ఎండలోపల ఉలెన్ కోటు వేసు కుంటాడా? అది తెలివితక్కువ కదా! తన డ్రస్సే అయినప్పటికి చలికాలంలో ఈ ఉలెన్ కోటు వేసుకోవాలి. కొంచెము వేడిలోపల Thin Cotton Shirt వేసుకోవాలి. ఈ వినియో గించుకొనే విధానంలో మార్పులు వస్తున్నాయి. ఈ ప్రజాపతి అనే సంవత్సరములో మన భావాలు సద్వినియోగం చేసుకోవాలి. ఎట్టి బాధలైనా, ఎట్టి కష్టములైనా, ఎట్టి దుఃఖము లైనా "భగవద్భావము" చేత సర్వమును సాధించవచ్చు. చాలా మంది ఈ విషయాన్ని నమ్మలేరుగాని, ఇది నమ్మి జీవిస్తే ఇంతకంటే సుఖము లేదు. కానీ అందరూ ఈ సత్యాన్ని గుర్తించుకోలేరు. పోనీ అంతో ఇంతో గుర్తించు కుంటే, అంతే చాలు.

## ఒక్క దినంలో నాల్గు యుగాల మార్పులు

ఉగాది అంటే కృతయుగ, త్రేతాయుగ, ద్వాపరయుగములకు సంబంధించినది, ఏదో కొన్నివేల సంవత్సరముల క్రిందట కృతయు గము పోయింది, అటుతరువాత కొన్ని వేల సంవత్సరాల క్రిందట త్రేతాయుగం పోయింది అని అనుకొంటూ- యుగాల క్రింద, కాలము క్రింద మనము గడుపుతున్నాము.

ప్రేమస్వరూపులారా! ఏదో కొన్నివేల సంవత్సరాల క్రిందట కృత, త్రేతా, ద్వాపర, కలియుగములు వచ్చినవి కాదు. ఇవన్నీ కేవలం "కేలండరులో" వారాలు వస్తూ న్నట్లుగా ఈ యుగములు కదలుతూనే ఉంటాయి. ఇప్పుడు ఈ కలియుగం పోతూనే తిరిగి కృతయుగము వస్తుంది. ఇది వేల సం వత్సరములకు సంబంధించినది కాదు. జీవిత ములోపల చక్కగా విచారిస్తే, నిత్యము ఒక్క దినంలో 24 గంటలలోపల నాలుగు యుగాలు మారిపోతున్నాయి. (1) తెల్లవారుఝామున నాలుగు గంటల నుండి మధ్యాహ్నం పన్నెండు గంటల వరకు కృతయుగము. మానవుడు ధర్మమును నాలుగు పాదములలోపల నడచ టానికి తగిన శక్తిసామర్థ్యం కలిగి ఉంటుంది ఆ కాలం, (2) మధ్యాహ్నము పన్నెండు గం టల నుండి సాయంత్రం ఆరు గంటల వరకు ఇది త్రేతాయుగము. ఇక్కడ ధర్మము ఒక పాదము క్షీణించిపోతుంది. అనగా మానవ దేహములో ఉండిన శక్తులు కొంత నశించి పోతాయి. అక్కడ 3 పాదములు మాత్రమే సంచరిస్తూ ఉంటాయి, (3) సాయంకాలము ఆరు గంటల నుండి రాత్రి పన్నెండు గంటల

వరకు అది ద్వాపరయుగము. అప్పుడు రెండు పాదములతోనే ఉంటుంది ధర్మం. అనగా శారీరక, మానసిక సంబంధములైనదంతా చల్లబడి ప్రాణమయ, విజ్ఞానమయ మనేటటువంటివి రెండుమాత్రమే అక్కడ సంచరిస్తూవుంటాయి. (4) ఆతరువాత రాత్రి పన్నెండు గంటల నుండి తెల్లవారి నాలుగు గంటల వరకు కలియుగం. ఈ కలియుగములో- ఒక్క పాదము మాత్రమే వుంటుంది. ఏమిటి ఆ ఒక్క పాదము యొక్క ధర్మం? మైమరచి గురకలు కొట్టుకుంటూ నిద్రపోవటమే దాని ధర్మం.

## బ్రహ్మ అనాది

కృత యుగము యొక్క కాలం 18,32,000. త్రేతాయుగము యొక్క కాలం 14,68,000. ద్వాపరయుగము యొక్క కాలం 8,32,000. కలి యుగము యొక్క కాలం 4,63,000. ఇవన్నీ కూడితే ఎంత అవుతుందో, అది బ్రహ్మకు ఒక్క పగలు అని, ఈలాంటివి అన్నీ చేరినప్పుడు- బ్రహ్మకు నూరు సంవత్సరములు అన్నారు. కనుక ఈ విధముగా చూచుకొంటే, మానవత్వము అర్థము చేసుకోవటానికి ఏమాత్రం వీలు కాదు. ఎవరు బ్రహ్మ? సోహమే బ్రహ్మ. ఈ బ్రహ్మ యొక్క వయస్సు అనాది. అనగా బ్రహ్మకు అనేక కోట్ల సంవత్సరములు ఒక పగలు. ఈ విధంగా మనము ఆలోచిస్తే, బ్రహ్మ అనాదికాక మరియేమిటి? కనుకనే "బ్రహ్మ అనాది" అని పేరు పెట్టారు, ఈనాటి సైంటిస్టులంతా ఏదో పెద్ద విజ్ఞానమును బోధించినవారమని, విజ్ఞానమును గుర్తించు కొన్నవారమని, ఈ అనాదికి ఒక కాలమును నిర్ణయిస్తూ వస్తున్నారు. ఇప్పుడు అన్ని కోట్లు అంటుంటే ఎవరు ఎంచుకొన్నవారమవుతాము? దీనికంటే 'అనాది' అని చెబితే, ఎంత సులభముగా ఉంటుంది? అనాది అని చెప్పినవాడు "మొరటువాడు", ఇన్ని కోట్ల సంవత్సరములంటే "సైంటిస్టు". ఇది ఈనాటి ప్రచారప్రబోధలు.

## భగవంతుడు కాలస్వరూపుడు

కృతయుగ, త్రేతాయుగ, ద్వాపరయుగ, కలియుగములంతా— ఒక్క దినం లోపల మార్పు చెందినటువంటివే. కనుకనే కాలమునకు— "భగవత్‌స్వరూపుడు" అని పేరు. యుగములకు 'ఆదివాడు' కనుకనే— "ఉగాది" అని పేరు వచ్చింది. "యుగాదైనమః" అని భగవంతునికి పేరు. కాలముతో కూడినవాడు భగవంతుడు. కాలమునే ఆత్మగా విశ్వసించినవాడు భగవంతుడు. కనుకనే అతనిని— "కాలాత్మకాయనమః" అన్నారు. ఆ కాలమునే తన గర్భమునందు ధరించినవాడు కనుకనే— "కాలగర్భుడు" అని భగవంతునికి పేరు. కనుకనే— "కాలకాలప్రపన్నాయనమః" అన్నారు. కాలమనే తత్త్వము కాయమును మ్రింగివేస్తుంది. కానీ, కాలమునే మ్రింగేటటువంటివాడు భగవంతుడు అని— "కాయమును మ్రింగేది కాలము- కాలమును మ్రింగేవాడు భగవంతుడు".

## శిక్షలు - రక్షలు

ప్రేమస్వరూపులారా!

సంవత్సరాది పండుగ అంటే ఏమిటి? భగవంతుని పేరుతో వచ్చేదే సంవత్సరాది పండుగ. కనుకనే కాలమంతా భగవంతుని

స్వరూపమే. భగవంతుని యొక్క సహస్ర నామములలో కూడను 'సంవత్సరాయనమః' అని ఒక పేరుంది. సహస్రనామముల లోపల కాలకాలాయనమః, కాలదర్పదమనాయనమః కాలాతీతాయనమః, కాలస్వరూపాయనమః- ఇవన్నియూ భగవంతుని యొక్క పేర్లే. కనుక సంవత్సరాది పండుగ అనగా పరమాత్ముని పేరుతో వచ్చిన పండుగ. సంవత్సరములో ఈ నష్టములు, ఈ కష్టములు, ఈ సుఖములు జరుగుతాయని ఏమాత్రము భయపడనక్కర లేదు. భగవంతుడే సంవత్సర రూపములో దిగి వస్తున్నాడు. అందులో చెడ్డ జరిగేటటువంటిది చెడ్డ జరుగవచ్చు, మంచి జరిగేటటువంటిది మంచి జరుగవచ్చును. శ్రీ మహావిష్ణువు ప్రత్యక్షమై ధృవునికి, ప్రహ్లాదునికి ఆనందాన్ని అందిస్తాడు. కానీ, హిరణ్యకశిపుని, భస్మాసురుని భస్మం చేస్తాడు. అక్కడ ఆనందమును అందించినది ఆ విష్ణువే, ఇక్కడ భస్మం చేసినది ఆ విష్ణువే. కాని, వారి వారి గుణములను పురస్కరించుకొని, శిక్షలు- రక్షలు జరుగుతూ ఉంటాయి.

## ఎక్కడ భగవంతుడో అక్కడ ఆనందం

హృదయమును ఆనందమయముగా మనం మార్చుకోవాలి. అదే స్వర్గము. "తన సంతోషమే స్వర్గం, తన దుఃఖమే నరకము". స్వర్గ, నరకములు రెండూ ప్రత్యేకంగా లేవు. మన ఆనందమే స్వర్గము. కనుకనే మనము ఎప్పుడూ ఆనందముగానే ఉండాలి. ఈ ఆనందము మనకు లభించాలంటే, నిరంతరం భగవచ్చింతన ఉండాలి. ఎక్కడ భగవంతుడో అక్కడ ఆనందం. ఈనాడు మనము సంవత్సరాదిపండుగ చేసుకొంటున్నామంటే మధురమైన భావాలచేత, దివ్యమైన చింతనలచేత దైవత్వమును మన హృదయంలో ప్రతిష్ఠగావించుకోవాలి. దైవాజ్ఞను శిరసావహించి ఆచరిస్తే, ఇంతకంటె సాధన మరొకటి లేదు. 'ఇది చేయమని చెప్పితే, అది చేస్తే అక్కడ విరుద్ధం వచ్చేస్తుంది'. విపరీతమైన ఫలితంలోపల విపరీతము ప్రారంభిస్తుంది. ఈ విపరీతంలో వికారం పుడుతుంది. వికారంలో ఆకారం మరచిపోతాము. ఆకారం మరచిపోయినప్పుడు అన్నీ పాపాలే చేస్తాము. కనుక ఆజ్ఞను శిరసావహించి ఆచరిస్తే, ఇంతకంటె మించిన ఆనందం లోకంలో మరొకటి లేదు.

—శ్రీవారి దివ్యబోధ
ప్రశాంతిమందిరం,
ప్రశాంతినిలయం; 17-3-1991.



# రామాయణంలో ఆదర్శమూర్తులు

"మీరు చూడాలనుకొంటే- 'పరమాత్మ'నే చూడాలికాని, ఇతర చూపులు చూచుట వెఱ్ఱితనము. మీరు నడవాలనుకొంటే- 'భగవంతుని'తో నడవాలికాని, వేరు మార్గాలలో నడచుట వెఱ్ఱితనము. మీరు పలకాలనుకొంటే- 'సత్యాన్నే' పల్కాలికాని, వేరు పల్కులు పల్కుట వెఱ్ఱితనము. మీరు పాడాలనుకొంటే- 'తత్త్వాల'నే పాడాలికాని, వేరు పాటలు పాడుట వెఱ్ఱితనము. సాధు సద్గుణసంపన్నులైన ఓ సభ్యులారా! మీరు వినగోరిన- 'హరిభజన' వినాలి. మీరు చూడగోరిన- 'దైవాన్ని' చూడాలి. మీరు చేరదలచిన- 'దైవాన్ని' చేరాలి— ఇంతకు మించిన 'పరతత్త్వం' లోకంలో మరెక్కడా కానరాదు".

"చక్కెరకంటే, తేనెకంటే, వెన్నకంటే- తీపితనము, రుచికరము కల్గినట్టిది- 'శ్రీరాము'ని నామమే. అట్టి నామాన్ని తనివితీరా ఎన్ని సారులు పల్కినా- అంతకంతకు సంతృప్తి కలిగిస్తుంది. అంతేకాదు- ఆ నామాన్ని నోటితో పల్కగా పల్కగా, మిక్కిలి కమ్మతనం కలిగిస్తుంది- ఆ నామము 'అమృతమే' అని యనిపిస్తుంది. అట్టి నామాన్ని- ప్రతి నిత్యం మనసార స్మరించి తరించండి".

ప్రేమస్వరూపులారా!

ఈ ప్రపంచమున గల సమస్త పదార్థములు మార్పు చెందునవి. ఒకనాటికి సమస్త ప్రాణులు నశించవలసినదే. కానీ ఆదర్శము, పవిత్రమైన ఆశయము, ఎంత కాలమైనప్పటికినీ మానవహృదయాలలో సజీవమై రాణిస్తూనే ఉంటుంది. ఆదర్శము, పవిత్రమైనదానిని పొందవలెనన్న అనేక కష్టములకు, నష్టములకు, దుఃఖములకు, నిందలకు, నిష్ఠూరములకు- గురికావలసి వస్తుంది. ఇట్టి ఆశయాలు, ఆదర్శాలు అనేక విధములైన కష్టములకు, నష్టములకు నెట్టుకొని, తట్టుకొని సాగటంచేతనే ఈనాటికి లోకంలో దేదీప్యమానంగా ప్రజాహృదయాలలో రాణిస్తూనే ఉన్నాయి. ఈ ప్రపంచములో యుగములు మారినా, జగములు కదిలినా, జీవితములు నశించినా- 'ఆశయాలు ఆదర్శాలు' సజీవమై ప్రకాశిస్తూనే ఉంటాయి.

## బుద్ధి - వివేకము

భుజబలంతో, జనబలంతో, ధనబలంతో- సాధించలేని ఘనకార్యములను బుద్ధిబలముతో సాధించుటకు ఎంతైనా అవకాశం ఉంటున్నది. బుద్ధిబలము యొక్క ప్రధానమైన గుణము వివేకము. ఇట్టి వివేక తత్త్వమును మానవుడు సత్యాన్వేషణ చేతనే, ధర్మాసక్తి వలననే దీనిని అభివృద్ధి గావించుకొనవచ్చును సత్యాభిరుచి లేకుండా వివేకమును పోషించుటకు ఎవరికీ వీలుకాదు. ప్రపంచములో సూర్యచంద్రాదులు ప్రకాశిస్తూ ఉంటున్నారు. ఎవరికివారు ప్రకాశము ఉన్నదని భ్రమిస్తున్నారు. కానీ ప్రకాశించే ఈ ప్రకృతి సంబంధమైన సూర్యచంద్రాదులకు అతీతమైన, అగమ్యమైన, అనంతమైన ఒక ప్రకాశము మరొకటి గలదని మానవులు గుర్తించుకొనలేకపోతున్నారు. ప్రాకృతమైన సూర్యుడు స్వప్రకాశకుడు అని భావిస్తున్నారు. ఆ సూర్యప్రకాశముచేతనే చంద్రుడు ప్రకాశిస్తున్నాడు. చంద్రుడు స్వప్రకాశకుడు కాకపోయినప్పటికిని, సూర్యప్రకాశము చేతనే చంద్రుడు వెలుగొందుచున్నాడు. అదే విధముగనే బుద్ధి, వివేకముల యొక్క ప్రకాశము ఒకదానినొకటి అనుసరించి స్వప్రకాశస్థితిని పొందుచున్నదని మానవులు భ్రమించుచున్నారు. వివేకప్రకాశము బుద్ధివలన కలుగుచున్నది, బుద్ధిప్రకాశము ఆత్మచేత కలుగుచున్నది. కానీ అజ్ఞానులైన మానవులు బుద్ధి, వివేకము యొక్క ప్రకాశమును మాత్రమే లక్ష్యమునందుంచుకొని ఆధారమైన, అతి ప్రధానమైన ఆత్మతత్త్వాన్ని విస్మరించుట చేతనే మానవత్వాన్ని కోల్పోవుచున్నారు.

## "దైవం మానుషరూపేణ"

ఆ ఆత్మనే ఉనికి, ఆ ఆత్మనే బ్రహ్మము, ఆ ఆత్మనే పరతత్త్వము, ఆ ఆత్మనే పరమాత్మ, ఆ ఆత్మనే అవతారతత్త్వము. కానీ ఆకారము లేని ఆత్మతత్త్వము స్వర్గమునందుగాని, వైకుంఠమునందుగాని లేక కైలాసమందుకాని ఉండినంత మాత్రమున ప్రజలకు ఏమాత్రము ప్రయోజనం లేదు. ఆకారములేని ఆత్మతత్త్వాన్ని ఆరాధించుటకు ఏమాత్రము అవకాశము ఉండదు. కనుకనే అట్టి ఆకారము లేని ఆత్మతత్త్వము— ఒక ఆకారమును ధరించి, మానవులలో అనుకూలముగను, అనుగుణ్యముగను, వారికి సన్నిహితముగను, తగిన సహకారముగను— ఒక రూపాన్ని ధరించి వచ్చినదే ఈ రామావతారము. మానవులకు అందుబాటులో లేని అవతారతత్త్వమును మానవులు గ్రహించలేరు. మానవులకు అందుబాటులో ఉండే నిమిత్తము, వారికి అనుగుణమైన మార్గము అనుసరించే నిమిత్తము ఆకారమును ధరిస్తుంది అవతారము.

నిజముగా నిర్గుణ నిరాకారమైన తత్త్వము మానవుడు గుర్తించుటకు సాధ్యము కాదు. దురదృష్టవశాత్తు నిర్గుణ నిరాకారమైన ఆత్మతత్త్వము ఆకారము ధరించినప్పటికిని, తమ స్వభావమును పురస్కరించుకొని, తమ మానవత్వాన్ని దానికి అనుసరింప చేసుకొని, సామాన్యమైన మానవత్వంగా భావించుకొనే దురదృష్టవంతులు లోకంలో లేకపోలేదు. "మావలెనే ఆకారానికి కన్నులు, చెవులు, ముక్కు, నోరు— ఉంటున్నవి. మావలెనే భుజిస్తున్నారు, సంచరిస్తున్నారు, మాట్లాడుతున్నారు. కాబట్టి ఈ అవతారమునకు మాకు ఎందులో వ్యత్యాసము ఉంటున్నది?" అనే సంకుచిత భావము చేత ఈనాటి మానవులు ఈ దివ్యత్వమును దూరము గావించుకొంటున్నారు. అసలు దైవత్వమంటే ఏమిటో గుర్తించుకొనుటకు ప్రయత్నించాలి. "దైవం మానుష రూపేణ" మనుష్య రూపమును ధరించి రావటం చేతనే, మనుషులు మాధవత్వాన్ని విశ్వసించుటకుగాని, చేరుటకుగాని, అనుభవించుటకుగాని చక్కని అవకాశము ఉంటుంది. జీవితమును అనంతముతో హెచ్చించినప్పుడు, అదే దైవత్వముగా మారిపోతుంది.

## భారతీయుల మతము

దైవము, విరాటస్వరూపుడు, హిరణ్యగర్భుడు అనేవి ప్రత్యేకముగా ఎక్కడో ఒక లోకంలో లేవు. అన్నీ మానవునియందు ఇమిడి ఉంటున్నవి. అసలు తన స్వస్థానమును మరచి, మధ్యస్థానములో గడచి నటువంటి కాలములో తిరిగి స్వస్థానమునకు చేర్చే నిమిత్తమై ఏర్పడునటువంటివే ఈ మతములు. భారతీయ దివ్యమైన మతములకు అనేకమంది అనేక అర్థములు ప్రబోధించి, దాన్ని విమర్శించి, యథార్థమైన సత్యాన్ని విస్మరించి, అనర్థములతో కూడిన అసత్యమును విశ్వసించి ఈ మతమునకు ఒక విధమైన విలువనే లేకుండా చూచుకొంటున్నారు మానవులు. మతమనగా తన స్వస్థానమునకు తిరిగిచేర్చటమే మత స్వభావము, మతలక్ష్యము. భగవంతునితో చేరటమే Religion. కనుక ఈ Religion అంటే ఏవోకొన్ని పద్ధతులచేత, కొన్ని సిద్ధాంతములచేత, కొన్ని నిబంధనలచేత ఏర్పడిన ఒక కఠినమైన శిక్షగా భావిస్తున్నారు. కాదు-కాదు. మనం మరచినటువంటి మన స్వస్థానమును జ్ఞాపకంగావించి, తిరిగి మన స్వస్థానమును చేర్చేటటువంటి పవిత్రమైన మార్గమే ఈ మతము.

పవిత్రమైన అంతరార్థమే "తత్ త్వం అసి" దానిని దీనితో చేర్చటమే తత్వమసి. "ప్రజ్ఞానం బ్రహ్మ"; ఆ దివ్యమైన, ఆ భవ్యమైన, ఆ నవ్యమైన- "ప్రజ్ఞానతత్త్వాన్ని" తిరిగి జ్ఞాపకం గావించు కొనుటయే మతము. "అయం ఆత్మా బ్రహ్మ" అనెడు ఆత్మ తత్త్వమును బోధించేటటువంటిదే ఈ మతము. అనగా "నేను" అనే జీవతత్త్వము బ్రహ్మతత్త్వముగా విశ్వసింప చేయడమే మతము యొక్క అంతరార్థము. అంతేకాదు- "అహం బ్రహ్మాస్మి" నేనే తిరిగి ఆ బ్రహ్మతో చేరిపోతున్నాను, రెండూ ఒక్కటే అనే సత్యాన్ని ప్రబోధించునదే ఈ మతము యొక్క అంతరార్థము. కనుకనే ఋగ్వేద, యజుర్వేద, సామవేద, అథర్వణ వేదముల యొక్క ప్రమాణములను చక్కగా యథార్థముగా నిరూపింపజేసి జీవతత్త్వము దైవత్వముతో ఏకీభావము గావించేటటువంటి దివ్యమైన మార్గమే భారతీయుల మతము.

## అవతారములెందుకు వస్తాయి?

అవతారతత్త్వములన్నీ ఇట్టి ఏకత్వమును బోధించే నిమిత్తమై, భిన్నత్వమును దూరంగాచేసే నిమిత్తమై దివ్యత్వమును ప్రకాశింపచేసే నిమిత్తమై, ఆత్మ తత్త్వాన్ని ప్రకటించే నిమిత్తమై— అవతరిస్తూ ఉన్నాయి. అవతరించటమనగా దైవము మానవ స్థాయికి దిగిరావటమే. ఆ స్థాయికి దిగినంతమాత్రమున అవతారతత్త్వమునకు ఎట్టి కళంకము ఉండదు. ఆ అవతారములకు ఎట్టి విలువలు ఏమాత్రము క్షీణించవు. దీనికొక ఉదాహరణ: చంటిబిడ్డ భూమిపై ఆడుకుంటూ ఉంటుంది. ఆ బిడ్డ యొక్క తల్లి తాను పెద్దదాన్ని కదా! అని అహంకరించి ఆ బిడ్డతో— "నీవు ఎగిరితే" తాను ఎత్తుకుంటానంటే, ఆ బిడ్డ ఎగరగలదా? కాని, ఆ బిడ్డపైనున్న ప్రేమతో ఆ తల్లియే వంగి, బిడ్డను ఎత్తుకుంటుంది. కేవలము ఆ తల్లి వంగినంత మాత్రమున, ఆ బిడ్డకు ఆ తల్లి లొంగి పోయినట్లవుతుందా? కాదు. కాబట్టి, దివ్యస్థానాన్ని పొందలేని అశక్తులైన మానవులను అనుగ్రహించే నిమిత్తమై, దైవం మానవాకారమును ధరించి వారి స్థాయికి దిగివస్తుంది. దైవము మానవాకారమును ధరించి, వారి స్థాయికి దిగివచ్చినంత మాత్రమున ఆ అజ్ఞాని కేవలం తనకోసమే లొంగివచ్చినట్లుగా భావిస్తాడు. ఆ రీతిగా వచ్చుట "వంగటమే కావి, లొంగటం కాదు".

ఈరీతిగా రావడము- భగవంతుని అనుగ్రహ ప్రభావమేకాని ఆతడు లొంగి వశమైపోవుట కాదు. ఎప్పటికీ, ఆతని గుణాలు, పవిత్రశక్తులు తరగకుండా స్వస్వరూపంగానే ఉంటాయి. ఏయే ప్రదేశములలో,

ఏయే పరిస్థితులలో, ఏయే కాలములలో, ఏ విధమైన శక్తిని ప్రకటించవలెనో, అక్కడ, ఆయా దేశకాల ప్రభావములను పురస్కరించుకొని ప్రకటిస్తూనే ఉంటాడు. ప్రాపంచిక సంబంధమైన వ్యక్తులతో అతడు ఆడుతూ, పాడుతూ, నడుస్తూ ఈ విధముగా ఉన్నంత మాత్రమున ఆ సుప్రీంస్టేజి యొక్క శక్తులెక్కడా పోవు. కాని తక్కువబుద్ధి కలిగినవారికే ఇవన్నీ భిన్నములుగా కనిపిస్తాయి. రాముడు పామరునివలె బాధ పడటం, వియోగము సంభవించినప్పుడు వికారము పొందడం మున్నగునవి రామాయణంలో ఎక్కువగా కనిపిస్తాయి. కానీ, ఇవన్నీ రాముడు ఎందుకోసం చేసినాడంటే, తన సాటి మానవులకు సహజమైన ధర్మప్రవృత్తిని ప్రబోధించే నిమిత్తమై, వ్యక్తులేవిధంగా ప్రవర్తించాలనే ఆదర్శాన్ని అందించే నిమిత్తమై ఈ రీతిగా ప్రదర్శిస్తూ వచ్చాడు.

## పితృవాక్య పరిపాలన — సీతాపరిత్యాగము

రామాయణము ప్రతి గృహానికి, ప్రతి కుటుంబానికి, అత్యవసరమైన ఆదర్శాన్ని అందించిన మహాకావ్యము. తండ్రి - కొడుకులు, భార్యా - భర్తలు, అన్నదమ్ములు, రాజు - ప్రజలు, తోడికోడండ్రు— మున్నగువారలు ఏరీతిగా మసలుకోవాలనే విషయాన్ని తెల్పేదే రామచరిత్ర. ఈ విధంగా అన్ని గృహాలలో ఏకత్వాన్ని పోషించి, దివ్యత్వాన్ని అనుగ్రహించి, దైవత్వంగా మార్చినటువంటిదే ఈ అవతారతత్త్వం. ఎప్పుడో తన పినతల్లికి, దశరథుడు ఇచ్చిన మాట నెరవేర్చటానికి రాముడు సంసిద్ధుడైనాడు. తాను మహారాజుకాగల ఆ క్షణములో, అట్టి పవిత్రమైన సదవకాశమును త్యాగముచేసి అరణ్యానికి వెళ్ళాడు. సర్వజ్ఞుడు, సర్వవ్యాపకుడు, సర్వశక్తిమయుడైన రాముడు రాజ్యపాలనకు తగినసమర్థుడు. అట్టి సర్వసమర్థత తనలో ఉండినప్పటికీ, తండ్రివాక్యమును నిలబెట్టే నిమిత్తమై, తన సర్వస్వమును త్యాగంచేసి అరణ్యానికి వెళ్ళాడు. ఇది ఆదర్శవంతమైన చర్య. పితృవాక్య పరిపాలనలో ఇక్ష్వాకుల వంశము ప్రసిద్ధి గాంచినదనే సత్యాన్ని రాముడు నిలబెట్టినాడు. ఆ సత్యాన్ని నిలబెట్టే నిమిత్తమై రాముడు ఎన్ని కష్టములైనా, ఎన్ని నష్టములైనా సహించి, భరించి, తట్టుకొని, నెట్టుకొని- ముందునకు సాగిపోయినాడు.

ప్రజలలో ఉండిన ప్రేమను, విశ్వాసమును అభివృద్ధిని గావించుకొనే నిమిత్తమై ఇన్ని రకములైన మార్గాలను అనుసరిస్తూ వచ్చాడు. ఒక అల్పుడైన చాకలివాడు రామునిపైన ఏదో ఒక తెలియనటువంటి "నింద" వేసేటప్పటికి, "నా ప్రజలలో ఒక అల్పుడైనవాడే, ఈ విధమైన మాటలతో బాధిస్తూ ఉండగా, ఇంక నా ప్రజలలో ఈ రహస్యం ఎంత నిగూఢంగా దాగి ఉన్నదో కదా!" అని భావించుకొని, లోకం నిజతత్త్వాన్ని గుర్తించుకొనే నిమిత్తమై సీతను అరణ్యానికి పంపగలిగినాడు. అందుచేతనే, శ్రీరామ చంద్రుడు ప్రజాపరిపాలన చేయుటలో చాలా ప్రతిష్ఠగాంచిన మహారాజైనాడు.

ఈనాడు అప్రయోజకులు, అశక్తిపరులు ప్రజాపరిపాలన చేయాలని సంసిద్ధులుగా ఉంటుండి దానిని ఆశిస్తారు. ఇది కేవలము ఒక దుర్మార్గం. ఈనాటి భారతదేశము ఇంతటి దుస్థితికి దిగజారటానికి ఇదే ముఖ్యకారణము. అప్రయోజకుల పరిపాలన చేతనే, భారతదేశం మరింత దిగజారిపోయింది. ప్రజాపరిపాలన చేయుటకోసం గుణవంతులైన, స్వార్థాన్ని త్యాగం చేయగల పవిత్ర పురుషులు రావాలి. ఇట్టి ఆదర్శాన్ని నిరూపించినవాడే శ్రీరాముడు. ప్రజలకు, తనకు ఉండిన సన్నిహిత సంబంధబాంధవ్యమును చక్కగా గుర్తించుకొని వర్తించిన మూర్తి ఈ చక్రవర్తి.

## అన్నదమ్ముల అనురాగం

రామచంద్రుని అన్నతమ్ముల ఐకమత్యము, అనురాగము వర్ణింపరానిది. పినతల్లి ఆజ్ఞప్రకారము రాముడు నారచీరలను ధరించి, తాపసవేషము వేసుకొని

అరణ్యమునకు వెళ్ళవచ్చు, కాని లక్ష్మణునకు ఎవ్వరి ఆజ్ఞలేదు, తాను ఎవ్వరిని అనుసరించవలసిన అవసరము లేదు. కానీ, తన సోదరుడైన రాముడు ఈ విధమైన స్థితిలో ఉండినప్పుడు, "నేను సుఖముగా ఈ రీతిగా అయోధ్యలో జీవించుట నా ధర్మం కాదు" అని భావించుకొని, తనకు తల్లి, భార్య ఉండినప్పటికిని తానుకూడా తన సర్వస్వమును త్యజించి రామచంద్రుడే నా ప్రాణమని విశ్వసించి, రామచంద్రునితో తాపస వేషమును ధరించి అరణ్యాలకు వెళ్ళినాడు.

అంతేకాకుండా, లక్ష్మణుడు, "రాముడులేని అయోధ్య నాకు అరణ్యమే, రాముడున్న అరణ్యమే నాకు అయోధ్య" అని విశ్వసించినాడు. నిద్రాహారములు మానుకొని లక్ష్మణుడు- రాత్రింబవళ్ళు ఆ అరణ్యంలో "సీతారాముల సేవ" చేస్తూ వచ్చాడు.

ఈనాటి కాలంలో "రాముడు అనాడు అరణ్యానికి పోతేపోయాడు కానీ, నాకు మాత్రము చక్కగా దక్కింది కదా!" అని భావించి వచ్చే లాభాన్ని దక్కించుకోవటానికి ఎన్నెన్నో ఉపాయాలు చేస్తారు ఈనాటి సోదరులు. "ప్రాపర్టీ" కోసమని ఒకరికొకరు పోరాడి Supreme Court వరకు వెళ్ళుతారు. ఉన్న ప్రాపర్టీ పాడు చేసుకుంటారు. వారిద్దరికీ అనుభవించే యోగము ఉండదు. కట్టకడపటికి తినటానికి, ఉండటానికి లేక, "తిత్తి బోడి, నెత్తి బోడి" అనే సామెత రీతిగా, ఇద్దరూ Supreme-Court లో ఈ ధనమంతా పాడు చేసుకుంటారు. లోకంలో ఈ విధమైన దుర్మార్గములో ప్రవేశించే సోదరులుంటారు. అట్టి సోదరులకు రాముడు ఆదర్శవంతమైన దానిని లక్ష్మణుని ద్వారా అందిస్తూవచ్చాడు.

## సీతారాముల సంవాదం

శ్రీరామ చంద్రుడు ప్రతీ కుటుంబానికి, భార్యాభర్తలలో ఉన్న సంబంధమును, కర్తవ్యమును- తన ద్వారా అందిస్తూ వచ్చాడు. ఎండ కన్నెరుగని సీత. అతి సుకుమారి. అట్టి సీత దట్టమైన అరణ్యానికి రాముడు వెళ్ళే సమయమందు తానుకూడా, అరణ్యములో ప్రవేశించి తన "పతిసేవ" చేయాలని ఆశించింది. కానీ, రాముడు ఎన్ని విధములుగనో- ఆమెకు సమాధానము చెబుతూవచ్చాడు, "సీతా! మేము పురుషులము, వెళ్ళేది దండకారణ్యము. ఆ అడవిలో క్రూర మృగాలు, రాక్షసులు భయంకరమైన శబ్దాలు చేస్తూ ఉంటారు. అనేకరకములైన క్రూరమృగాలంతా విహరిస్తూ ఉంటాయి". అప్పుడు సీత చెప్పింది, "నా దగ్గర "పురుష సింహము" ఉండినప్పుడు, క్రూర మృగాలు నన్నేమి చేయగలవు? అన్ని మృగాలు మృగరాజైన సింహానికి భయపడవలసిందే కదా! అందులో- నీవు 'పురుష సింహుడవు' కనుక, నాకు ఎట్టి భయాలు చెప్పనక్కర లేదు" అని స్పష్టంగా చెప్పివేసింది.

తిరిగి రాముడు, "నీవు ఏనాడూ అరణ్యాలు చూడలేదు. అక్కడి రాక్షసులు చాలా భయంకరమైన వేషాలుధరించి ఉంటారు. నేను నిన్ను రక్షించుకొనుట చాల కష్టమవుతుంది" అని అన్నాడు. తిరిగి సీత, "పదునాల్గు లోకాలు రక్షించే నీకు, ఒక్క సీతను రక్షించుకొనుట చేతకాదా? ఇది పిరికితనము కాదా?" అని చెప్పి, తానుకూడా వస్తానని చెప్పింది. ఈ విధంగా ఒక్కొక్క మాటకు ఒక్కొక్క మాటను సమాధానముగా చెప్పుకుంటూ తన భర్తతో వెళ్ళడానికి ఉపాయము పన్నుతూ వచ్చింది. కానీ ఇంకా శ్రీరామ చంద్రుడు తన ధోరణిని మార్చకుండా, ముందునకు సాగిస్తూనేపోయాడు, "సీతా! నా తల్లిదండ్రులు నా వియోగము చేత మహా దుఃఖాన్ని పొందుతున్నారు. కాబట్టి నాకు బదులుగా, నా తల్లిదండ్రులకు సేవచేస్తూ- అయోధ్యలోనే ఉండమని" చెప్పాడు.

వీరిద్దరి సంభాషణకు పూర్వము, రాముడు కౌసల్యతో మాట్లాడిన సందర్భములో, ఆమెకోసం ఎన్ని నీతులు రాముడు బోధించాడో, అవన్నీ సీత

వినడం జరిగింది. రాముడు, "అమ్మా! నేను తండ్రి ఆజ్ఞప్రకారము అరణ్యానికి వెళ్ళుచున్నాను" అని చెప్పి, నమస్కారం చేయడం జరిగింది. అప్పుడామె రాముని చూచి, "నాయనా! లేకలేక కలిగిన కుమారుడవు. అనేక యజ్ఞయాగాదుల చేత లభించిన వరప్రసాదుడవు. అట్టి నిన్ను క్షణమైనా వదలిపెట్టి ఉండలేను" అని కౌసల్య రాముని రెండు చేతులు పట్టుకొని బ్రతిమాలుకొంది. అప్పుడు రాముడు, కౌసల్యకు చక్కని నీతులెన్నో చెబుతూ వచ్చాడు, "సతికి పతియే దైవం. తల్లికి పుత్రుడు ఎంత ప్రియమైన వాడైనప్పటికీ, భర్తకంటే అధికుడు కాదు. కనుక "ఆత్మానాం పుత్రనామాసి" తండ్రి యొక్క ఆత్మయే పుత్రుడుగా పుట్టాడు. నేను కేవలం ప్రతిబింబమే, కానీ నా తండ్రి బింబము, నా తండ్రి సేవ చేయటమే నీ ప్రధాన ధర్మము కానీ, నా వెంట అరణ్యానికి రావడం నీకు ధర్మం కాదు" అని "స్త్రీ ధర్మాన్ని" రాముడు నిష్కర్షగా, అనేక రకాలుగా బోధించడం జరిగింది.

ఇక్కడ సీత విషయములో మాత్రము, 'నీవు అత్తమామల సేవ చేస్తుండమని' రాముడు చెప్పేటప్పటికి, సీతకు ఆ విషయాలన్నీ చక్కగా గుర్తుకు వచ్చి, "రామా! తల్లికి ఒక బోధ, నాకొక బోధ ఉంటుందా? "పతిసేవయే" సతికి ప్రాణమని అక్కడ నీవు బోధించినావు కదా! ఒక్క కౌసల్యకు మాత్రమే ఆ బోధకు సంబంధమై ఉంటుందా? నాకు మాత్రము దానితో సంబంధం లేదా? నా పతిసేవయే నా ప్రధానమైన ప్రాణము. కనుక నా కోసం నీవు ఏమాత్రము బాధ పడనక్కర లేదు. నీ మాట నీవు దక్కించుకొనే నిమిత్తమై నన్ను నీ వెంట అరణ్యానికి తీసుకొనిపొమ్మని" చెప్పి, "తండ్రివాక్యం పరిపాలించే నిమిత్తమై నీవు వెళ్ళుతున్నావు, పతివాక్యం పరిపాలించే నిమిత్తమై నేను వస్తున్నాను" అని చెప్పింది. కనుక ఇట్టి సతీపతుల అనుబంధ, సంబంధబాంధవ్యములను ఇంత పవిత్రమైన ఆదర్శముగా రాముడు నిరూపిస్తూ వచ్చాడు.

## రామాయణంలో - భరతుని పాత్ర

ఇక్ష్వాకుల వంశం- సత్యపరిపాలనలో ప్రసిద్ధి గాంచినటువంటిది. సత్కీర్తిని సాధించినటువంటిది. కనుక ఆనాటి కులాలు, కుటుంబాలు ఇంత విశ్వాసాలతో జీవిస్తూ వచ్చాయి. కైక తన కుమారుడైన భరతునకు రాజ్యం కట్టపెట్టాలని కోరినప్పటికీ, అతడు అంగీకరించలేదు. 'తండ్రి ఇచ్చిన రాజ్యమే, తల్లి కోరిన రాజ్యమే' వచ్చింది కదా! అని భరతుడు ఆనందించక, జ్యేష్ఠ పుత్రుడైన రామచంద్రుడు పరిపాలించవలసిన రాజ్యాన్ని అన్యాయంగా, అక్రమంగా తాను పరిపాలించడం ఇక్ష్వాకుల వంశమునకే 'అపకీర్తి' అని త్యజించి తృణీకరించినాడు. అంగీకరించక పోవటమే కాకుండా, ఆ రాజ్యములో- నేను అడుగు పెట్టను, ఆ సింహాసనమును నేను చూడను. తుచ్ఛమైన ఈ రాజ్యం కోసమై, మా తాతముత్తాతలనాటి నుండి వచ్చిన "సత్కీర్తిని" నేను మట్టిపాలు చేయుదునా? నేడు "తండ్రి ఆజ్ఞను" పరిపాలించే నిమిత్తమై రాముడు- అరణ్యాలకు వెళ్ళినప్పుడు, నేనుకూడా "కులకీర్తిని" రక్షించే నిమిత్తమై అరణ్యానికి వెళతాను. కాబట్టి ఈ రాజ్యము నాకు అక్కరలేదు" అన్నాడు.

చిట్టచివరకు "నంది" గ్రామానికి ధర్మసమ్మతముగా "శ్రీరామ పాదుకలు" తెచ్చి సింహాసనముపైన పెట్టి, తాను తాపస వేషమును ధరించి కాలమును గడుపుతూ వచ్చాడు. ఈ విధముగా లభించిన అవకాశమును ఎవ్వరైనా తప్పించుకుంటారా? వెతుకుతూ వచ్చిన సంపదను ఎవ్వరైనా కాలదన్నుకుంటారా? కాదు-కాదు. ఇది సంపద కాదు. నాకిది "అపకీర్తి" అనే సత్యాన్ని భరతుడు చక్కగా గుర్తించి, వర్తించినాడు. కాబట్టి ఒక్కొక్క కుటుంబానికి, ఒక్కొక్క వ్యక్తి తన కర్తవ్యాన్ని ఏరీతిగా నిర్వహించాలనే ఆదర్శాన్ని రామాయణం చక్కగా అందిస్తోంది.

## ఊర్మిళ త్యాగం

లక్ష్మణుని భార్య ఊర్మిళ. ఈమె మహాసాధ్వి. లక్ష్మణుడు తాను "రామ సేవ" చేసే నిమిత్తమై రామునితో అడవులకు వెళ్ళుచున్నానని తెల్పినంతనే, ఆతని భార్య ఊర్మిళ వినయముతో తలవంచి నమస్కరించి, "అయ్యో! నాకట్టి భాగ్యం కలుగలేదు. కాబట్టి మీరైనా వెళ్ళిరండి" అని చక్కగా తెల్పింది. అటుతరువాత తానుకూడా వెళ్ళాలనే ఆశ కలిగినప్పటికీ, ఈ విధంగా తిరిగి లక్ష్మణునికి తెల్పుకొంది, "నేను మీ వెంటవస్తే, సీతారాముల సేవ మీరు చేయుటలో నేను అభ్యంతరము కలిగించిన దానిని అవుతాను. అందుచేత ఎట్టి అభ్యంతరము లేకుండా మీరు సీతారాముల సేవ చేసే నిమిత్తమై, మీతో రాకుండా నేను అయోధ్యలో ఉంటాను" అని మనస్ఫూర్తిగా తన అంగీకారమును తెల్పుకొన్నది. సీతకంటే మహాత్యాగము చేసిన వ్యక్తి ఊర్మిళ.

## మాతృ దీవెన

అన్నగారైన శ్రీరామునితో అరణ్యవాసానికి బయలుదేరుచున్న సమయమందు లక్ష్మణుడు తన తల్లియైన సుమిత్ర పాదములకు నమస్కారము చేసి, "అమ్మా! ఆశీర్వదించు" అని కోరాడు. అప్పుడు సుమిత్ర ఈ విధంగా ఆశీర్వదించింది, "నాయనా! శ్రీరామ చంద్రుడు లేని ఈ అయోధ్య నాకు అరణ్యము. ఆ శ్రీరామ చంద్రునితో కూడిన ఆ అరణ్యమే నీకు అయోధ్య. ఆనందముగా సేవ చేసుకో. నేను చాలా ఆనందముగా నీకు వీడ్కోలు చేస్తున్నాను" అని పల్కింది. ఏ తల్లియైనా ఆ రీతిగా పంపగలదా? పంపలేదు. ఇటువంటి పవిత్రమైన హృదయాలు కలిగిన కుటుంబమే ఆ శ్రీరామ చంద్రుని కుటుంబము.

శ్రీరామ చంద్రుడు తన తల్లియైన కౌసల్య దగ్గరకు వచ్చి నమస్కారము చేసాడు. పుత్రవాత్సల్యము చేత తన కుమారుడు భగవంతుడని తెలిసినప్పటికిని, దేహసంబంధమైన వాత్సల్యము పెల్లుబుకుట చేత ఈ విధముగా ఆశీర్వదించింది, "నాయనా! తారకాసురుని పరాక్రమ శక్తిని, భుజబల సంపదను క్రుంగదీయుటకై బయలుదేరిన విఘ్నేశ్వరునికి ఆ గౌరీదేవి ఇచ్చిన 'వీరరక్ష', మాతృదాస్యమును మాన్పించుటకై గరుత్మంతుడు బయలుదేరు వేళ ఆతని తల్లియైన వినత అతనికి ఇచ్చిన 'విమలరక్ష' మున్నగు రక్షలన్నియూ నీపాలిట అంగరక్షలై, ధీరక్షలై, శ్రీరక్షలై శ్రీరామరక్షగా నిన్ను కాపాడు గాక" అని ఈరీతిగా ధన్యమైన, దివ్యమైన రక్షలెన్నింటినో పెట్టి ఆశీర్వదించి శ్రీరాముని సాగనంపినది. ఈ విధంగా ఆ శ్రీరామ చంద్రుని తల్లి, పిన తల్లులు, సోదరులు, వారి భార్యలు ఎన్నో విధములైన ఆనందములతో ఆతనికి వీడ్కోలు చేసారు.

రామచరిత్రలో మనము ముఖ్యముగా గుర్తించవలసినది, ఆ కుటుంబాల సమైక్యత. కుటుంబము ఐకమత్యముతో ఉంటే గ్రామము ఐకమత్యముగా ఉంటుంది. గ్రామాలు ఆనందముగా ఉండినప్పుడే, దేశము ధర్మముగా ప్రకాశిస్తుంది. "కులగౌరవము కోసము కొడుకునైనా వదలుకో, గ్రామము యొక్క క్షేమము కోసము కుటుంబాన్నైనా త్యాగము చేయి, దేశక్షేమానికి గ్రామాన్నైనా త్యాగం చేయి" ఇదే విదురుడు చెప్పిన నీతి. ఆనాడు ఇంతటి నీతి నిజాయితీలతో రామపరిపాలన కొనసాగింది.

## భగవంతుడు స్వార్థరహితుడు

భగవంతుడు శిక్షించవచ్చు, రక్షింపవచ్చు, ఆనందపెట్టవచ్చును. దంతవక్త్రి, శిశుపాలాదులను సంహరించాడు. పాండవులను రక్షిస్తూ వచ్చాడు. ప్రహ్లాదుని రక్షిస్తూ వచ్చాడు. హిరణ్యాక్ష, హిరణ్యకశిపులను సంహరించాడు. రావణ, కుంభకర్ణులను శిక్షించాడు. విభీషణునికి పట్టము కట్టాడు. గోపికలను ఏడిపించాడు. గోపాలురకు ఆనందమును అందించాడు. ఈనాటి ప్రజలలోపల అడుగడుగునా సందేహాలే,

అనుమానాలే. "దేవుడెందుకు ఇట్లా చెయ్యాలి?" అని ప్రశ్నించుకుంటారు. అంతేకాదు. దేవునికి తనకు చాలా భిన్నముగా చూచుకొంటారు. భగవంతుని దివ్యత్వం, అనంతతత్త్వం గుర్తించినవారికి ఇటువంటి సందేహాలకు అవకాశమే ఉండదు. అనంతతత్త్వమును గుర్తించుకోలేని అల్ప బుద్ధులే ఇటువంటి యోచనలు చేస్తారు. వారి జీవితమంతా అల్పత్వముతోనే అంత్యమైపోతుంది. కనుక మీరు ఈ అల్పత్వమును దూరం చేసుకోవాలి. దైవము స్వార్థరహితముగా ఏమి చేసినా దోషం లేదు. ఇవన్నీ ఎందుకు చెయ్యాలనే ప్రసక్తి లేదు. ఇవన్నీ ఆతని లీలలో ఒక విధమైన భావాలే. దైవములో స్వార్థమనేది ఏ భాగమునందు కూడా లేదు.

## ఆదర్శవిద్యార్థి

ప్రాచీన కాలములో ఒక పెద్ద గురువు ఉండేవాడు. అనేకమంది శిష్యులు అతని వద్దచేరి విద్యలను అభ్యసించేవారు. శిష్యులందరూ గురువుగారిని, "మా తండ్రి, మా సర్వస్వము మీరే" అని స్తుతించేవారు.

కొంతకాలము జరిగిన తరువాత శిష్యుల విద్యాభ్యాసము పూర్తియైనది. వారందరూ గురువుగారి వద్ద శెలవు తీసుకొని వారి వారి ఇండ్లకు బయలుదేరినారు. శిష్యులు వెళ్ళే సమయములో గురువుగారు ప్రతి ఒక్కరికి ఒక నామాన్ని ఉపదేశము చేసి, ఆ నామాన్ని ఎల్లప్పుడూ స్మరించుకోమని చెప్పినాడు. శిష్యులు ఎవరింటికివారు వెళ్ళిన తరువాత "గురుదేవుని" గూర్చి గుర్తు చేసుకోవటం తక్కువైపోయింది.

మరికొంత కాలమైన తరువాత గురువుగారికి అంత్యకాలము సమీపించినది. శిష్యులందరికీ రమ్మని కబురు పంపినాడు. రమ్మని కబురు రాగానే దగ్గరగా ఉన్నవారంతా తక్షణమే వచ్చి, అందరూ గురువుగారి చుట్టూచేరి ఎక్కడలేని Anxiety ప్రదర్శించినారు. వీరి ఆర్భాటము, తాపత్రయము చుట్టూ ఉన్న పెద్దలంతా గమనిస్తూనే ఉన్నారు.

ఒక శిష్యుడు మాత్రము చాలాదూరముగా ఉండినవాడగుటచేత, వెంటనే రావటానికి వీలుకాక చాలా ఆలస్యమైపోయింది. ఆ శిష్యుడు గురుదేవుని వద్దకు సాధ్యమైనంత తొందరగా చేరుకోవాలనే తపనతో బయలుదేరాడు. గురువుగారి గ్రామానికి మార్గ మధ్యములో ఒక నది మహోధృతంగా ప్రవహిస్తోంది. నదీతీరానికి చేరుకున్నాడు. ఈతన్ని, అక్కడ ఉన్న వారందరూ నదిలోనికి దిగవద్దని, చాలా ప్రమాదకరమని హెచ్చరిస్తున్నారు. కానీ ఈ శిష్యుడు ఇవేమీ పట్టించుకోలేదు. ఏమాత్రమూ ఆలస్యము చేయకుండా గురువుగారిచ్చిన నామాన్ని స్మరించుకొంటూ ఆ నదిలో పడ్డాడు. ఆశ్చర్యం! ఆ నదిలోని నీరు ఆతని మోకాలు దాటలేదు. అతడు అవతల గట్టునకు చేరుకున్నాడు. గట్టుపైన ఉన్న ప్రజలంతా ఈ అద్భుతాన్ని కళ్ళారా చూచి, ఈతడెవ్వరో మహాత్ముడని, మహిమాన్వితుడే అని విశ్వసించి, ఆతని వెంటబడ్డారు. వారందరిని ఎలాగో తప్పించుకొని గురువుగారి ఆశ్రమాన్ని చేరుకొన్నాడు. ఈ శిష్యుణ్ణి చూచి మిగిలిన శిష్యులందరికీ విస్మయం కలిగింది. అంతగా ప్రవహిస్తున్న నదిని ఈతడేవిధంగా దాటి రాగలిగినాడో వారికి అర్థం కాలేదు.

శిష్యుడు గురువుగారి పాదములు పట్టుకొని నమస్కరించి, వినమ్రుడై నిలిచాడు. గురువుగారు, "నాయనా! అంత ప్రమాదకరముగా ప్రవహించే ఆ నదిని ఎట్లా దాటగల్గి నన్ను చేరగలిగావు?" అని ప్రశ్నించారు. శిష్యుడు, "స్వామీ! మీ ఉపదేశమే నన్ను నదిని దాటించి, సురక్షితంగా తమ సన్నిధికి చేర్చింది" అన్నాడు. వెంటనే మిగిలిన శిష్యులలో గుసగుసలు ప్రారంభమైనాయి. "మన గురువునకెంత పక్షపాతబుద్ధి! ఒక్కనికి మాత్రము ప్రత్యేకమైన, మహత్తరమైన శక్తినిచ్చి, మనకు మాత్రము ఒక సాధారణమైన మంత్రమును తలంచుకోమని, తాను కాలం గడుపుచున్నాడు" అని గురువుగారిని దూషించు

టకు మొదలుపెట్టారు. గురువుగారు దీనిని గ్రహించి, "నాయనలారా! మీకిచ్చిన మంత్రమే ఆ పిల్లవానికి కూడా ఇచ్చాను. నాలో ఎట్టి పక్షపాతబుద్ధి, భేదంగాని లేదు. నాది విశాలమైన, నిస్స్వార్థమైన హృదయము" అని పల్కి ఆ శిష్యునిచూచి, "నాయనా! నీకేనామాన్ని ఇచ్చానో వీరందరికీ చెప్పు" అని అడిగినాడు. ఆ శిష్యుడు గురువుగారిచ్చిన నామాన్ని మిగిలిన శిష్యు లందరికీ తెలియజేశాడు. అందరూ విన్నారు. వీరంద రికీ ఇచ్చిన నామము కూడా అదే. అయితే వీరందరూ ఆ నామము యొక్క మహత్తును విశ్వసించి, సరిగా గుర్తించనందున దానిని ఉపయోగించుకొనలేకపోయి నారు. కాని ఈ శిష్యుడు మాత్రము ఆ నామమును ఉపదేశించిన గురుదేవుని, "ఆదర్శకుడు"గా భావించు కొని, "నా గురువే నాకు ఆదర్శకుడు" అనే విశ్వా సముతో ఆదర్శవిద్యార్థిగా మసలుకొన్నాడు. ఆ విశ్వా సమే ఆతనిని రక్షించినదిగాని నామములో ఏమాత్రము భేదము లేదు.

నామాలలో భేదాలు పెట్టుకొని ఎన్ని సాధనలు చేసినా నిష్ప్రయోజనమే! విశ్వాసము అత్యవసరము. విశ్వాసములేని నామాన్ని ఎన్ని సార్లు స్మరించినప్ప టికీ ప్రయోజనం లేదు. కాబట్టి నమ్మకము ప్రధానం.

## ప్రతీవ్యక్తి ఆదర్శపాత్రియుడు కావాలి

ఎన్ని చదువులు చదివినప్పటికీ, దురదృష్టవశాత్తు దైవాన్ని మాత్రము నమ్మడానికి పూనుకోవటం లేదు. ఈనాటి తెలివితేటలు, విజ్ఞాన వివేకములంతా అల్ప మైన వానిని నమ్మటానికి పనికివస్తున్నాయి. అధిక మైన, ఉత్తమమైన, అభివృద్ధిని పొందే ఆదర్శవంత మైన దానిని నమ్మటంలేదు. కనుక ఈనాటి మానవుడు ఇన్ని అవస్థలకు గురికావలసి వస్తున్నది. కాబట్టి నమ్మకము పెట్టుకోవాలి. శ్రీరాముని ఆదర్శముపైన నమ్మకము పెట్టుకొనుట చేతనే, ఎన్నివేల సంవత్సర ములు అయినప్పటికిని, ఈనాటికి "రామ" అంటే అందరూ గౌరవిస్తున్నారు. ఎన్ని యుగాలు మారినప్ప టికీ, ఆదర్శాలు చెక్కుచెదరవు. ఆదర్శవంతమైన జీవితముగా మనము రూపొందింపజేసుకోవాలి. ప్రతీ వ్యక్తి ఆదర్శపాత్రియుడు కావాలి. కేవలం ఆడంబర మానవుడు కారాదు. ఈ ఆడంబరము మాని, ఆత్మ విశ్వాసమును అభివృద్ధిపరచుకోవాలి. ఏనాడు మనము దైవత్వమును చింతిస్తామో, ఆనాడే మనకు "రామ యుగము" రాగలదు. అందరూ రామస్వరూపులే అవుతారు. రాముడనగా దశరథ కుమారుడు రాముడు కాదు. ఆత్మనే రాముడు. అందుకనే "ఆత్మారామా" అంటారు. రమింపజేసేవాడే రాముడు. ఆకర్షింపచేసే వాడే రాముడు. కనుక రామజననమనగా ఏమిటంటే ఏనాడు పవిత్రమైన, ఆదర్శవంతమైన భావాలు మనలో పెంచుకొంటామో ఆనాడే రామచింతన, రామజననము కాగలదు. కనుక ప్రేమచేత భగవంతుని పొందండి. భగవంతుని పొందడానికి ప్రేమతప్ప మరొకటి ఏదీ ప్రధానమైన సాధన ఈ లోకంలో లేదు.

—శ్రీవారి దివ్యబోధ
ప్రశాంతిమందిరం, ప్రశాంతినిలయం,
24—3—1991.



గురుదేవ వాణి:

# ఆత్మతత్త్వం

ప్రేమస్వరూపులారా!

"అహ మాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః
అహ మాదిశ్చ మధ్యం చ భూతానా మంత ఏవచ"

అర్జునా! "నేను ఆత్మను. సర్వభూతముల యందు నేనే నివసించుచున్నవాడను. ఆది, మధ్య, అంతము నేనే. ఈ చరాచర ప్రపంచము నందు గోచరించునదంతయు ఆత్మతత్త్వమే. ఆధ్యాత్మిక క్షేత్రమునందు అడుగడుగునా వినిపించునది, కనిపించునది, అనిపించునది, మైమరపించునది ఆత్మయే. లోకమునందు ఆత్మకానిది మరొకటి లేదు".

## ఆత్మసాక్షాత్కారం

ఈనాడు మానవుడు సాధించవలసినది ఆత్మనిష్ఠయే. స్వస్వరూపానుసంధానమే ఆత్మనిష్ఠ. తనను తాను గుర్తించుకోవటమే ఆత్మజ్ఞానము. మానవత్వము నందు ప్రధానముగా సాధించవలసినది ఆత్మానందమే. నిరంతరము జ్ఞప్తియందు ఉంచుకొనవలసినది ఆత్మతత్త్వమే. ఆత్మనే 'ఎఱుక' అని పిలువబడుతుంది. ఈ ఎఱుకయే సర్వభూతములందు, "నేను.... నేను" అనే స్ఫురణను కలిగిస్తుంది. ఈ స్ఫురణ శక్తియే అహం. ఈ అహం దేహంతో తాదాత్మ్యమును పొందినప్పుడు అహంకారముగా రూపొందుతుంది. ఇదే మిథ్యా నేను. అది సత్యమైన నేను కాదు. ఈ ఆత్మకు అనవరతము అడ్డు తగులునది మనస్సు. సూర్యుని వేడిమివల్ల ఆవిర్భవించిన మేఘములు సూర్యుని ఏవిధముగా మరుగు చేయుచున్నవో అదే విధముగా ఆత్మ నుండి పుట్టిన మనస్సు, మనోసంఘాతమైన మేఘములు ఆత్మకు అడ్డు తగులుతున్నాయి. మనస్సు ఉండినంతవరకూ మానవుడు ఆత్మతత్త్వాన్ని అర్థము చేసుకోలేడు. సర్వకాల, సర్వావస్థల యందును ఆత్మను గుర్తించ గలిగే స్థితియే ఆత్మసాక్షాత్కారమని చెప్పబడుతుంది.

## మనస్సహితమైన ఆత్మ మిథ్యాత్మ

ఆత్మ నుండి మొట్టమొదట వినిపించే శబ్దము 'నేను'. ఈ నేను అనే శబ్దము పుట్టిన తరువాతనే సృష్టి అంతయూ ఆరంభమైనది. నేను లేకుండిన సృష్టియేలేదు. నేను, బ్రహ్మ, ఆత్మ ఇవన్నీ పర్యాయ పదములు. మనోరహితమైన నేను స్వస్వరూపమైన ఆత్మ. మనస్సహితమైన నేను మిథ్యాత్మ. ఉన్నది ఒకే ఆత్మ. అదే ఒక్క నేను. కాని ఆత్మతో దివ్యత్వాన్ని అనుభవించే నిమిత్తమై మానవుడు అనేక సాధనలు చేస్తున్నాడు. ఆత్మాన్వేషణ నిమిత్తమై సల్పెడు సాధనలన్నియూ అజ్ఞాన దశలో ఆచరించే కర్మలే. ఈ సాధనలన్ని జ్ఞానియందు కానరావు. జ్ఞానికి సాధన, సాధ్యము అనే వ్యత్యాసము ఉండదు. మానవుడు సాధనలు చేస్తున్నాడంటే, కేవలము మానసిక సంతృప్తి నిమిత్తమై చేసే ప్రక్రియలే. మనస్సునే నిర్మూలనము గావించుకొనవలెనని వేదాంతము బోధించుచుండగా, మనస్సును సంతృప్తిపరచే సాధనలు చేయడం, దానిని బలపరచినట్లవుతుంది. సాధనలు చెయ్యాలని సంకల్పించుకొంటే, అనాత్మ భావమును దూరము గావించుకో. ఆత్మానందమును అందుకొనగోరినప్పుడు దృష్టిని ఆత్మవైపు మరల్చు. మోక్షప్రాప్తి నిమిత్తమై, ఆత్మానుగ్రహ నిమిత్తమై, ఆత్మజ్ఞాన నిమిత్తమై, ఆత్మానంద నిమిత్తమై సాధనలు చేయటం భ్రాంతియే. ఇవి కేవలము మనోభ్రాంతి చర్యలు.

## అభిమాన మమకారములు

నేటి మానవుడు ముక్తినిగోరి ముక్కోటి దేవతలను ఆరాధిస్తున్నాడు. ఉన్నది ఒక్కటే అని వేదము, శాస్త్రము, బైబిల్, ఖురాన్, ఏ గ్రంథమైనా నిర్ణయించి సత్యాన్ని బోధించుచుండగా, "ముక్కోటి" అనే సంఖ్యకు విలువ ఎక్కడ ఉంటున్నది? ఇవన్నీ మనోభ్రాంతుల వికారములే. మనస్సు ఉండినంతవరకూ కోరికలు తప్పవు, కోరికలు ఉండినంతవరకూ అభిమాన, మమకారములు వదలవు. అభిమాన, మమకారములుండినంతవరకూ అహంకారం పోదు. అహంకారం పోయేవరకూ ఆత్మజ్ఞానం కలుగదు. ఆత్మదర్శనము మనోనాశనము చేతనే సంభవిస్తుందిగాని, అన్యమార్గముతో మనకు లభ్యము కాదు.

## నిన్ను నీవు మరచిపోవద్దు

మనస్సు, బుద్ధి, చిత్తము మరి అహంకారము ఎందు పుట్టి, పెరిగి, ఎందడంగె? అదియే బ్రహ్మ. అదియే ఆత్మ. కనుక నీ పుట్టుక స్థానమును నీవు గుర్తించే నిమిత్తమై, నీ స్వస్వరూపాన్ని నీవు గుర్తించే నిమిత్తమై అన్యమార్గముల యందు నీవు అన్వేషణ సల్పిన ఇది ఏరీతిగా పొందగలవు? ఇది ఎట్లా ఉన్నదంటే, దొంగవాడు తాను పోలీసు వేషము వేసుకొని తన్ను తానే పట్టుకొనటానికి ప్రయత్నించినట్లుగా ఉన్నది. నిన్ను నీవు గుర్తించుకోవటానికి అన్యసాధనలు ఎందుకు?

దీనికొక చిన్నకథ ఉంది. పదిమంది మూర్ఖులు చేరి ఒక నదిని దాటడానికిపోయారు. ఆ నదిని దాటిన తరువాత పదిమంది తిరిగి వచ్చినామా? లేదా? అనేది వారి సందేహము. ఒకడు లెక్కపెట్టుటకు ప్రారంభించాడు. 1, 2, 3, 4, 5, 6, 7, 8, 9 అయ్యో! ఇంకొక్కడు లేడే! నదిలో కొట్టుకుపోయాడు అని ఒకరికొకరు భ్రాంతిచేత విచారం పొందుతూ వచ్చారు. నీవు చెప్పింది సరికాదు. నేను చూస్తానని వేరొకడు 1, 2, 3, 4, 5, 6, 7, 8, 9 అని నీవు చెప్పింది నిజమే! ఇంకొకడు లేడే అని వాడు కూడా ఏడుస్తూ కూర్చున్నాడు. అదే మార్గమునందు ప్రయాణము చేస్తున్న ఒక బాటసారి, అతడు వివేకవంతుడు, వీరి యొక్క బాధను చూచి నాయనా! మీరు దుఃఖించటానికి కారణము ఏమిటని ప్రశ్నించాడు. మేము పదిమందిమి వచ్చాము, కాని తొమ్మిదిమందే ఉన్నాము, ఇంకొకడు ఈ నదిలో కొట్టుకొనిపోయాడని ఏడ్చారు. వారి అజ్ఞానమును గుర్తించి ఆ బాటసారి 1,2,3 4.....

అని పదిమందిని ఎంచి, నాయనా! మీరు పదిమంది ఉంటున్నారు కాని ఎవరు ఎంచుచున్నారో, వారు తనను తాను మరచిపోయి ఎంచుతున్నారు. కనుకనే ఒకరు పోయినట్టుగా విచారిస్తున్నారు అని చెప్పాడు.

కనుక తనను తాను మరచిన వ్యక్తి సరియైన సత్యాన్ని గుర్తించలేడు. నీవే ఆత్మయై యుండి, నీవు ఆత్మ నిమిత్తమై మరొక దానిని ప్రార్థనగాని, సాధనగాని చేస్తే, నీ యొక్క తత్త్వము ఏరీతిగా గుర్తించగలవు ? "ఏకోహం బహుస్యామ్" ఒక్కటే అనేకముగా మారిపోవుటచేత, భిన్నత్వములో నీవు అభిరుచిని అభివృద్ధిపరచుకొని ఏకత్వమును విస్మరిస్తూ వస్తున్నావు. ఇవన్నీ అద్దములో కనిపించే ప్రతిబింబములవలె, నీ యొక్క ప్రతిబింబములే. బింబమును వదలి, ప్రతిబింబమును విశ్వసిస్తున్నావు. కనుక నీవు భ్రమతో కట్టబడి ఉంటున్నావు. బ్రహ్మ భ్రమతో కట్టబడినవానికి చిక్కడు. కనుక ఆత్మభావమును మనము అనుభవించాలనుకొంటే, మనము చేసే సాధనలన్నీ నిరుపయోగమైనవి

## నీ తత్త్వాన్ని నీవు గుర్తించుకో

ఈ సాధనలన్నీ మనస్సును చల్లబరుస్తాయి. మనస్సును చల్లబరచి ప్రయోజనము ఏమిటి? మనస్సే లేకుండా చేసుకోవాలి. మనో నాశన నిమిత్తమై ఆచరించే సాధనలే, ఆత్మాన్వేషణకు సరియైన సాధన. ఇక్కడ మనిషియందు ఈ దేహాత్మ భావన చేరిపోవుటచేతనే, "అహం" అనేది ఇన్ని రకములైన మార్గములందు త్రిప్పుతున్నది. "నేను చేస్తున్నాను", "నేను దీనిని జయించినాను" అనే కర్తృత్వ భావం మానవుని యందు దినదినాభివృద్ధి చెందుతున్నది.

విద్యార్థులారా! జయాపజయములు మీ కర్మల వలనగానీ, మీ సాధనల వలన గానీ, మీ ప్రయత్నముల వల్లగానీ, కలిగేవి కాదు. కేవలము భ్రాంతిలో మునిగి నీవు, యత్నముచేత ఈ కార్యమును సాధించినట్టుగా నీవు అహంకారమును మరింత పెంచుకొంటున్నావు. ఎన్ని ప్రయత్నములు చేసినప్పటికిని విజయము సాధించలేని కార్యములు ఎన్ని మనకు కనిపించుటలేదు. ఏమి చేయకపోయినప్పటికిని విజయము పొందే కార్యములు ఎన్ని మనకు కనిపించుటలేదు. నీవు ప్రయత్నము చేసి తద్వారా అపజయముపొంది విచారమునకు గురి అయ్యేదాని కంటే, దైవమును విశ్వసించి దైవకార్యముగా నీ తత్త్వాన్ని నీవు గుర్తించినప్పుడే, సర్వమూ విజయవంతమౌతుంది. మన ప్రయత్నముతో జరిగేది ఏది లేదనే దాన్ని మనము చక్కగా గుర్తించాలి. దేహమునందే ఈ విధమైన సాక్ష్యము మనకు సాక్షాత్కరిస్తున్నది. నీ దేహములో ఉన్న గుండె కొట్టుకోవటానికి నీవు ఏ ప్రయత్నము చేస్తున్నావు? నీవు క్షణ క్షణమునకు ఉచ్ఛ్వాసనిశ్వాసములు తీసుకొంటున్నావు. దీనికి నీవు ఏమి ప్రయత్నము చేస్తున్నావు? నీవు భుజించిన ఆహారము జీర్ణమౌతున్నది. దానికి నీవు ఏమి ప్రయత్నము చేస్తున్నావు? ఇవన్నీ ప్రయత్నముతో లభ్యమవుతున్నాయా? కాదు, కాదు. నేను బ్రతకాలి, బ్రతకాలి అనుకుంటే నీవు బ్రతక గలుగుతున్నావా? నేను చావాలి, చావాలి అనుకుంటే నీవు చస్తున్నావా? నీ పుట్టుకకు నీవే కారకుడవా? కాదు, కాదు. కనుక ఈ విషయమును చక్కగా విచారణ చేస్తే, కేవలం నీ కర్తృత్వ, భోక్తృత్వములే నీ అహంకార, మమకారములను మరింత అభివృద్ధి గావించుచున్నాయి.

## మనస్సంటే ఏమిటి?

ఈనాడు జగత్తులో మనము ఆచరించే సమస్త కార్యములు మనస్సుకు తృప్తి నిమిత్తమై చేసే కర్మలే. కనుకనే ఈ కర్మలు ఎంతకాలము చేసినప్పటికిని మనస్సుకు తృప్తి అనేది ఉండదు. మనస్సంటే ఏమిటి? మనస్సే మాయ. మనస్సే వాంఛ. మనస్సే అవిద్య. మనస్సే ప్రకృతి. మనస్సే భ్రాంతి. కనుక

ఈ భ్రాంతిలో నీవు మునిగి బ్రహ్మమును పొందాలను కుంటే, ఇది సాధ్యమవుతుందా? కేవలము నీ నీడను చూచి, నీవే భయపడుతున్నావు. కానీ ఉన్నది ఒక్కటే అదే ఏకం సత్. అదే ఆత్మ. భగవంతుడు సత్-చిత్ ఆనంద స్వరూపుడని అనేక మంది పండితులు వర్ణిస్తారు. ఇది సరైన జవాబుకాదు. సత్తు తానే, చిత్తుతానే, ఆనందము తానే. భగవంతునికి ఈ మూడు గుణములుగా ఉంటున్నాయిగాని, భగవంతునికంటే వేరైనవిగాదు. ఏదో నాకు తెలియని మహత్తరమైన శక్తి నాకంటే వేరుగా ఒకటి ఉంది అని కొంతమంది విశ్వసించి గోప్యముగా, దివ్యమైన శక్తి ఏదో ఒకటి నాకు వేరుగా ఉన్నది, దానిని నేను పొందాలి అని దీక్షలు పూనుతారు. ఇది కేవలము అజ్ఞానముయొక్క చర్య. నీ కంటే వేరైనది ఒకటి ఉన్నది అను కున్నంత వరకును నీవు పూర్తి అజ్ఞానములో మునిగిన వాడవే. నీకంటె మించినది మరొకటి లేనే లేదు. ఉన్నదని ఊహించడం నీ మనోభ్రాంతి. ఇది ఎట్లా ఉన్నదనగా స్వప్నములో అనేక దృశ్యములు, అనేక అనుభవములు చూస్తాము. ఇది ఎంత వరకు నిజము? స్వప్నములో ఉన్నంత వరకే. స్వప్నము తీరెనా ఇది నిజము కాదు. నీవు మనోభ్రాంతిలో ఉండినంతవరకూ కష్టము, నష్టము, విచారము, దుఃఖము యివన్నీ సత్యములే. మనో భ్రాంతి వీడితివా, ఇదంతా అసత్యము.

## చైతన్య తత్త్వం

దేహమే "నేను" అనే భావముతో అహంకారమును పెంచుకుంటున్నా, తనకంటే వేరైనది ఒక్కటి జగత్తునందు లేదు. ఉన్నవన్నీ ఉన్నదాని మిథ్యా ప్రతిబింబములే. లోక సంబంధమైన విషయాలకు కర్త, కర్మ, క్రియ ఈ మూడు ఉంటాయి ఆత్మ సంబంధమైన విషయమునకు కర్త తప్ప క్రియ కర్మ ఏమాత్రము ఉండుండదు. చేయించేవాడు తానే, చేసేవాడూ తానే, చేయింపబడు కర్మలు తానే. ఈ మూడింటితో కూడిన ఆత్మ తత్త్వమే సర్వత్రా నిండిన చైతన్యము.

ఈ చైతన్య తత్త్వము ఒక్కరి దగ్గర ఉండి మరొకరి దగ్గర లేకుండా ఉండటానికి వీలులేదు. ఈ చైతన్యమునే మూడు భాగములుగా విభజించి, సత్, చిత్, ఆనందము అని పేరు పెడుతూ వచ్చారు. దాని ప్రతి బింబము ఇది, దీని ప్రతిబింబము అది, అని చూపుతూ వచ్చారు వేదాంతులు. ఈ మూడు ఒక్కటే. ఈ టంబ్లరు ఇక్కడ ఉన్నది. ఇది అస్తి. సత్-చిత్ అంటే ఏమిటి అది మనము చూస్తున్నాము. చూడటమే కాకుండా ఇది టంబ్లరని తెలుసుకున్నాము. ఇంకా ఆనందమంటే ఏమిటి? దీనిని మనము అనుభవిస్తున్నాము. ఈ సత్ చిత్ ఆనందము మూడైనవి కదా! ఈ సత్, ఉన్నదీ ఒక్కటే, ప్రకాశించేదీ ఒక్కటే. ఆనందింపజేయునదీ ఒక్కటే. కనుక ఒకేదానియందు మనము అనేక రకములైన భ్రాంతుల చేత అనేకత్వముగా అనుభవించి అనేక రూప నామములు కల్పిస్తూ ఉన్నాము. కనుక ఆత్మతత్త్వము అనగా ఏకత్వముతో కూడిన దివ్యత్వమనే సత్యాన్ని గుర్తించాలి.

## ఆత్మ రూప రహితం

ఈ ఆత్మ రూపము లేనిది, ఇది కేవలము అనేక రూపములను ధరించేది. గాలి ఉంది దీనికి ఏమి రూపము? రూపము లేనంత మాత్రాన గాలి లేదని చెప్పటానికి వీలుందా? ఐతే ఈ గాలి ఏ ఆకారమును ఆశ్రయిస్తుందో, ఆ ఆకారస్వరూపాన్ని పొందుతుంది. ఒక బెలూన్‌లో చేరితే బెలూన్ రూపం పొందుతుంది, తల క్రింద పెట్టుకొనే తలగడలో చేరితే తలగడగా కనిపిస్తుంది, ఒక Foot ballలో చేరితే Foot ball రూపాన్ని పొందుతుంది. దీనికి ఒక రూపము లేదు, కాని గుణము ఉంటున్నది. అదే చైతన్య గుణము.

ఈ చైతన్య తత్త్వాన్ని అర్థము చేసుకోవాలంటే చాలా కష్టము. ఈ చైతన్య మనేదే Consciousness అన్నారు. ఈ CONSCIOUSNESS ను గుర్తించాలనుకొన్నా, అర్థం చేసుకోవాలనుకొన్నా దాని నుంచి చిన్న భాగమైన దానిని తీసుకొని Conscience అనే రూపకంగా తయారు చేసుకుంటూ వచ్చాము. అనగా Witness అని. దీనినే awareness అని. దీనినే సాక్ష్యము అని. అయితే సాక్ష్యము ఉంది. ఈ సాక్ష్యమునకు ఏదైనా ఆధారము కావాలి కదా! దీని నుండే Conscious వచ్చేసింది. Consciousness, Conscience, Conscious ఈ మూడింటి యొక్క తత్త్వము మూడు గుణములుగా మారిపోతూ వచ్చాయి.

ఆత్మభావము అనేది ఏకంగా మనం భావించాలి. ఉన్నది ఒక్కటే అన్యము లేదు. ఐతే ఈ మనస్సు, దేహము ఇవన్నీ ఉండినంతవరకూ ఈ ఏకత్వమును పొందటము చాలా కష్టము. కష్టము - కష్టమని నిరంతరము దీనినే అనుభవించటము ఇది కూడా సహజం కాదు. కష్టమైనప్పటికిని మన సత్యాన్ని మనము గుర్తించుకొనుటకు తగిన ప్రయత్నము చేయాలి.

మన దేహము ఒక రథమని గుర్తించుము. దీనికి గుఱ్ఱములు ఇంద్రియములని గుర్తించినాము. వీనికి పగ్గములు మనస్సు అని అర్థం చేసుకొన్నాము. దీనికి సారథి బుద్ధి. ఈ రథము, ఈ గుఱ్ఱములు, ఈ సారథి యజమాని నిమిత్తమై ఏర్పడ్డారు. ఆ యజమాని అనేవాడు దీనిలో ఆత్మస్వరూపుడై ఉంటున్నాడు. కనుకనే, "ఏకోవశీ సర్వభూతాంతరాత్మా" ఒక్కడే సర్వభూతముల యందు నివసిస్తున్నాడు.

## నీవు కర్తవు కాదు

నేను చేస్తున్నాననే కర్తగా నీవు మారవద్దు. దీని ఫలితము నాకే అందాలి అనే భోక్తృత్వములో నీవు దిగవద్దు. ఈ కర్తృత్వ, భోక్తృత్వమును మనము దూరం గావించి కర్తవ్యమును ఆచరించాలి. ఈ కర్తవ్యమే యోగము ఈ యోగము వలన దివ్యమైన ఆత్మభోగము అనుభవించవచ్చును. కానీ ఈ యోగము లేకపోవటం చేతనే, మనం రోగులుగా మారుతున్నాము. మానసిక సంబంధమైన వృత్తులను చక్కగా, జాగత్తగా మనము విచారించాలి. ఇది ఎక్కడ నుండి పుడుతున్నది? ఇది చేసే పనియేమిటి? దీన్ని మనం ఎందుకు అనుసరించాలి? దీనివల్ల కలిగే ఫలితమేమిటి? ఇది మనలను బంధనకు తీసుకొనిపోతున్నదా? లేక విశాలమైన మోక్షమునకు గొనిపోతున్నదా? అని విచారణ చేస్తే, ఇది క్రమ క్రమేణా బంధనకే తీసుకొనిపోతున్నది.

## ఆత్మస్వరూపం

ఆత్మతత్త్వమనేది కేవలము అన్యవిధములుగా విచారము చేయటానికి వీలు కాదు. ఈనాటి లోకములో భిన్న భావములు, భిన్న చర్యలు, అసూయలు, అహంకారములు, ద్వేషములు, అశాంతులు-అభివృద్ధి కావటానికి కారణం ఈ ఏకత్వమును కోల్పోవుటయే. కనుక మనం సమత్వమైన ప్రేమతత్త్వాన్ని పెంచుకోవాలి. ఈనాడు మనము చదివేచదువుల జ్ఞానము ఏమిటి? ఇది నిజమైన జ్ఞానమా? కాదు-కాదు- ఇది అజ్ఞానములోని అజ్ఞాన జ్ఞానము. మనం అజ్ఞానములో చదువుతూ, ఉన్న అజ్ఞానమునే అభివృద్ధి పరచుకొంటున్నాము

ఆత్మ - చైతన్యమునకు, మరొక చైతన్యమునకు మధ్య ఉన్నది. ఆ చైతన్యము ఆత్మ స్వరూపకముగా ఉంటున్నది. ఇది ఎప్పుడు మనకు అర్థమౌతుంది? అందరికీ అర్థము కాదు. జాగతకు నిద్రకు మధ్యస్థితివలె ఉంటుంది. ఐతే జాగ్రిత, నిద్రకు మధ్య స్థితి ఎట్లా ఉంటుదంటే ఎవరికి తెలియదు. జాగ్రత్తగా ఉండినట్లే ఉంటాము, తిరిగి కన్నుమూత పడిపోతుంది. కాని యోగులు మాత్రమే

దీనిని చక్కగా గుర్తిస్తూ వచ్చారు. ఈ జాగ్రత్తకు, ఈ నిద్రకు మధ్య ఉన్న తత్త్వము అదే నిజమైన ఆత్మతత్త్వము. జాగ్రత్త రజోగుణము, నిద్ర తమో గుణము. రెండింటికీ మధ్యనున్నది సాత్వికము, అదే ఆత్మస్వరూపము. కనుక ఈ ఆత్మ తత్త్వమును చక్కగా గుర్తించాలనుకుంటే, ఆత్మజ్ఞానమును మొట్ట మొదట విచారణ చెయ్యాలి.

—శ్రీవారి దివ్యబోధ
తేది 29—మే—1990.
బృందావనం.

అనుమానమే ఆస్తికునకు అంటువ్యాధి. అనుష్ఠానం ఉంటే అనుగ్రహం లభిస్తుంది. అన్నింటియందు కల ఆత్మశక్తి ఒక్కటే అనితెలుసుకొనుట బ్రహ్మజ్ఞానము, మిగిలినవి కర్మజ్ఞానము. అభిమాన శూన్యమే ఆనందనిలయం. అవివేకికి మనస్సే భూతం, వివేకికి మనస్సే దైవం. దోషికంటే దోషములను చర్చించువాడు దోషి. దైవముపైన భక్తి, జీవులపైన రక్తి, సేవపైన ఆసక్తి పెంపొందించండి. దేవతలు భోగస్వరూపులు, అమృతము త్రాగిరి. దేవుడు త్యాగస్వరూపుడు, గరళమును కంఠమునచేర్చి లోకాన్ని రక్షించినాడు.

-బాబా

## చందాదారులకు విజ్ఞప్తి

(ఎ) వార్షిక చందా 20 రూపాయలు మనియార్డరు ద్వారా— కన్వీనరు, శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ట్రస్టు, ప్రశాంతినిలయం (పోస్టు), అనంతపురం జిల్లా, ఎ. పి. — 515 134 కు పంపవలెను.

(బి) వేరుగా ఎక్నాలెడ్జిమెంటు కోరువారు తమ చిరునామాగల రిప్లై కార్డు పంపవలెను.

(సి) చందాలు ఒక సంవత్సరమునకు మాత్రమే స్వీకరింపబడగలవు.

(డి) చందాదారు పూర్తిపేరు, చిరునామా మనియార్డరు కూపను (సమాచార్ అనుచోట) పైననే స్పష్టముగా పెద్ద అక్షరాలతో వ్రాసి పంపవలెను.

(ఇ) మనియార్డరు కూపనుపైన, పత్రిక ( ఇంగ్లీషు / తెలుగు) ఏ భాషలో కావలెనో స్పష్టముగా పేర్కొనవలెను.

(ఎఫ్) చందాల రెన్యూవల్ కోరునప్పుడు, ప్రస్తుత చందాసంఖ్యను పేర్కొంటూ, రెండునెలలు ముందుగా పంపవలెను.

(జి) క్రొత్తగాచందాలు కట్టినవారికి చందా స్వీకరించిన రెండుమాసాల తర్వాత నుండి పత్రిక పంపగలం.

# సాయితత్త్వం - ప్రేమతత్త్వం

ధర్మానికి హాని కలిగి, అధర్మం ప్రబలుచున్నప్పుడు నిరాకారుడైన పరమాత్ముడు నరాకారం ధరించి భూమికి దిగివస్తాడు. మానవాకారం ధరించినపుడే భగవంతుడు మానవులకు అర్థమౌతాడు. అంతరిస్తున్న నైతిక విలువలు కాపాడుకోవడానికే భగవంతుడు- దివి నుండి భువికి దిగివస్తాడు. అదే "అవతారం" అంటారు. అవతారమనగా నిరాకారమైన తత్త్వం నరాకారంతో రావడం. సామాన్య నరులకు సామాన్య జీవితమును ప్రకటించి సామాన్య జీవితముతో ఆదర్శవంతమైన అధికారాన్ని వారికి నేర్పుటకు అవతారములు వస్తుంటాయి.

మన భాగ్యవశాన మన నడుమ సంచరిస్తున్న భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారి దివ్య ప్రేమదీప్తి ఎందరి హృదయమందిరాలలోనో మణిదీపికలను వెలిగిస్తున్నది. అవ్యాజమైన, అనమానమైన, అపార ప్రేమకు మూర్తీభవము భగవాన్ బాబావారే. ఆ ప్రేమశక్తి వల్లనే ఎందరో విదేశీయులు స్వామి వశంవదులై దాసులగుచున్నారు. భగవంతుడు మానవుడై అవతరించి మానవుడు ఆచరించవలపిన సత్య, ధర్మ, శాంతి, ప్రేమ ధర్మములన్నింటిని తాము ఆచరించి చూపించుచున్నారు. భగవాన్ బాబావారిలో దైవత్వము ఉన్నది, మనుషత్వమున్నది. అఘటితఘటనా సామర్థ్యముతో చేసిన కొన్ని కార్యములనుబట్టి, మానవుడుకాడు అను విషయము బోధపడుచున్నది. భగవాన్ బాబా వారి గుణగణములు తెలియుటవలనను, అవి లోకోత్తరమై ఉండుట వలననూ, మానవాతీతములై ఉండుటచే, భగవాన్ బాబావారు భగవంతుడు అని ధృవపడుచున్నది.

భగవాన్ బాబావారి ప్రేమతత్త్వం ముఖ్యముగా మానవులు తరించుటకు ఉపాయము తెలియజేయు విషయమై ఉన్నది. అజ్ఞానమును తొలగించి, జ్ఞానోదయమును కలుగచేసి, దైవభక్తిని కలుగచేయునదిగా ఉన్నది. భగవాన్ బాబావారు ప్రేమస్వరూపులు, ప్రేమనిధి. స్వామి ప్రేమలోనే ప్రకటితమౌతారు. సత్యసాయి ప్రేమతత్త్వం పరమపవిత్రమైనది. దానినిగురించి ఎవరు చెప్పినా, చెప్పుకున్నా వారి వారి జీవనములు, అంతఃకరణలు పరిశుద్ధమౌతాయి. భగవాన్ బాబావారిని ఎవరు అనన్యభావంతో సేవిస్తారో, భజిస్తారో వారు గుణాతీతులౌతారు. మన హృదయాలలో ఆ స్వామికి ఎంతటి స్థానమిచ్చెదమో - దానినిబట్టియే ఫలములు కూడా ఉంటాయి. స్వామి అనుగ్రహమునకు వేరొక మార్గము లేదు. మానవ రూపములో అవతరించిన భగవాన్ బాబావారు సమస్త మానవాళిని తనవద్దకు ప్రేమతో రప్పించుకొనుచున్నారు. స్వామి ప్రేమ నిర్మలము.

## భగవంతునికృప వల్లనే భగవద్భక్తి

భగవద్భక్తిగాని, భగవంతుడుగాని ఒకరివల్ల లభించేవి కావు. భగవాన్ బాబావారు ఎవరి ఆధీనములోనూ లేరు. మూల్యమిచ్చిన దొరకరు. దర్శన భాగ్యము పొందాలంటే అనన్య భక్తి అలవరచుకొనవలెను. అత్యంత ఆతురత కావాలి. దర్శనము కొరకు ఏకాంత లాలస మనస్సులో ఉంచుకొని తనను ఆయన కృపపైని వదలివేయాలి. ఉచిత సమయము చూచి బాబావారే భగవద్భక్తిని ప్రసాదించి దానిద్వారా దర్శనము, ప్రేమ జల్లులను లభింపజేస్తారు. దర్శన సమయంలో బాబావారు నన్ను చూడలేదు అనుకోవడం అవివేకం. వాస్తవానికి బాబావారి కృప అందరిమీదా కురియుచునేయున్నది. దానిని గుర్తించే సమయము రావాలి. భగవంతునికృప భగవంతుని దర్శనముకన్నా ఉపయోగకరము. భగవత్కృప అనన్య విశ్వాసము వల్ల, శరణాగతివల్ల లభించును.

భగవాన్ బాబావారి ప్రేమ, ఒక క్షీరసముద్రము. దాని వైశాల్యము మానవబుద్ధికి అందదు. అందుచేత భక్తియొక్కటే తత్తరణ సాధనము. భక్తియను సాధనమును, మానవుడు సాధించిన ఎడల భగవాన్ బాబావారి ప్రేమపుంజము వాని మీద కేంద్రీకరించునట్లు ఆ భక్తి తోడ్పడును. బాబావారి ప్రేమను అనుగ్రహముగా పరిణామ మొనర్చగల శక్తి, భక్తికి ఉన్నది. అందువల్లనే స్వామి భక్తప్రియుడు, భక్తజనహృదయాలయుడు. భగవంతునిపట్ల ఉన్న ప్రేమను భక్తి అంటారు. భక్తి అంటే పూజా మందిరాలలో దేవతామూర్తులకు పూజలు చేయటం కాదు. దివ్యత్వం మీద పరమ ప్రేమను పెంచుకోవడం. భగవంతుని అనుగ్రహాన్ని సంపాదించే భక్తుని ప్రేమ, చిత్తవృత్తి భక్తి.

"భక్తసంరక్షణ" స్వామివారి కార్యకలాపాలకు ప్రధాన లక్ష్యము. స్వామి అభయముద్రలో ఆనంద, సౌఖ్యాలతో రోజులు క్షణాలుగా దొర్లిపోతాయి. స్వామి సర్వహృదయ నివాసి. భయ సందేహములను వీడి ప్రేమను పెంపొందించుకొనండి. బాబావారు లేని స్థలము లేదు. బాబావారిది కాని నామము లేదు. బాబావారి ప్రభావం ప్రసరించి ధన్యులైన భక్తులలో అపారమైన ప్రేమ కనబడుతుంది. బాబావారి ప్రేమ స్వయంప్రకాశము. ప్రతిఫలాపేక్ష లేకుండానే స్వామివారి ప్రేమ సర్వులపై సమముగా ప్రసరించును. బాబావారి ప్రేమ సర్వవ్యాపకమైనప్పటికీ అందరూ దానిని అందుకొనలేరేమి? కొందరు మాత్రమే అందుకొని అనుభవించి ఆనందించెదరేమి? అంటే స్వామివారి ప్రేమను అర్హతగలవారే ఆశించి అనుభవించగలరు. ఇతరులు దానిని చూడలేరు, కనుగొనజాలరు. సర్వవ్యాపకమైన బాబావారి ప్రేమను అందుకొనదలచినవారి హృదయం ప్రేమమయము కావాలి.

## సుందరరూపుడు

స్వామి సుందరరూపాన్ని పూర్తిగా వర్ణించగలవారు లేరనే చెప్పవచ్చును. ధ్యానావసరార్థం కించిత్తుగా వర్ణించారేగాని అది పరిపూర్ణము కాదు. ఒకసారి ప్రశాంతినిలయంలో బాబావారి సౌందర్యాన్ని ఆస్వాదించినవారు తమని తాము మరచిపోతారు. "ఎన్నంగ మనసుకు రాని పన్నగశాయి సొగసు పన్నుగ కనుగొనని కన్నులేల?" అంటారు త్యాగరాజు. అందువల్ల భగవాన్ బాబావారి దర్శనం కావాలంటే కన్నులు పవిత్రము కావాలి. చెమ్మగిల్లని కన్నులు సత్యసాయి సుందరరూపాన్ని చూడలేవు. వారి పూర్ణతత్త్వము చూచుటకు, చెప్పుటకు సాధ్యము కానిది. మానవ జన్మము ఉత్కృష్టమైనది. మాటిమాటికి రాదు. అట్టి పవిత్ర జన్మమును సార్థకము చేసుకొనుటకు పవిత్రమైన ప్రవర్తనలు ప్రధానము. అట్టి ప్రవర్తనకు గుణము ముఖ్యము, పరమాత్మయే ప్రేమ.

—కె. వి. రామశేషు (నందిగామ)

# దేహం దేవాలయం

నీ కోవెలెచ్చోట? నిర్గుణ చతురాస్య!
అది నా శరీరమై అలరుచుండె.
నీ పీఠమెచ్చోట? ఓ పురుషోత్తమా!
అది నా మనోజ్ఞమై అందగించె.
నీ తీర్థమెచ్చోట? నీలకంఠస్వామి!
అది నా నరాలలో ఒదిగి పారె.
నీ దివ్వె ఎచ్చోట? ఆదిపరంజ్యోతి!
అది నా సుదృష్టిలో కదలసాగె—

నీవు నన్నావరించి యున్నావు - అది ఒ
కింత ఎరుగక లోక విహీనగతుల
విపివి - నినుజూడ వచ్చిన వేళలందు
ఎక్కడో "నేను" జారిపోయినది- దేవ!

—"శాంతిశ్రీ"

# రమ్యాలోకం

" అదె పుట్టపర్తి! అల్లదియె చిత్రావతి!
అల్లదే విశ్వవిద్యాలయంబు!
అదె సర్వమత సమైక్య స్తూప! మదె భక్త
సముదాయ విశ్రాంతి సౌధపంక్తి.
అదె ముఖగోపురం! బదె ప్రవేశద్వార!
మదె అదే శ్రీ గణేశాయతనము!
అదె ప్రశాంతినిలయ! మదె పూర్ణచంద్ర! అ
ల్లదె వేదమంత్ర మహారవంబు!

స్వామి చిరునవ్వుతో జనస్తోమమునకు
దర్శన మొసంగు బంగారుద్వార మదిగో!"
అనుచు కనుచుందు రనిమేషు లనుదినంబు
మింట గుమిగూడి జంటలు జంటలగుచు.

-కరుణశ్రీ



# శరణాగతి

ఏ పున్నెము ఫలించి ఈ పుట్టు వమరెనో
ఇంచుకంతేని నే నెరుగలేకున్నాను;
మరు పుట్టు వెట్టిదో గురుతింపగా రాదు;
సత్యసాయీశ్వరా! శరణు శరణు!

నీ పాదములు ముట్టి నింగి ముట్టిన యట్లు
పాప పంకము బాపి పరిమళించిన యట్లు
అనుభూతి కనగోరి అల్లాడుచున్నాడ;
సత్యసాయీశ్వరా! శరణు శరణు!

నీ వచో గంగలో నిలువెల్ల మునుగంగ
భావ శుద్ధిని బయలొందుదు నటంచు
తలపోసి తలపోసి తత్తరించుచునుంటి;
సత్యసాయీశ్వరా! శరణు శరణు!

నీవె నా తల్లివని నీవె నా తండ్రివని
నీవె నా ప్రాణమని నీవె నా సర్వమని
నెర నమ్మికొనియుంటి దరిజేర్చి కరుణించు
సత్యసాయీశ్వరా! శరణు శరణు!

-స్ఫూర్తిశ్రీ (గుంటూరు)